# వార్తా: చిత్రాలు



బళ్లారిలో అగడి లక్ష్మీనారాయణగారి ధర్మశాలకు గవర్నరు గారు శంకుస్థాపన చేశారు.



ఆంధ్రకాంగ్రెస్ పంచాయతీఎన్నికల విచారణకువచ్చిన శ్రీ ఎస్. కె. పాటిల్ గారు.



మద్రాసు గవర్నరు శ్రీ భావనగరు మహారాజాగారికి బళ్లారి జూనియర్ సర్టిఫైడ్ స్కూలు బాలుర గౌరవందన.



పండితులు అవధానం కృష్ణమూర్తిగారి షష్ఠిపూర్తి ఉత్సవము రాజమన్నార్ గారి అధ్యక్షత క్రింద జరిగినది.



గవర్నర్ గారు బళ్లారి వ్యాయామకేంద్రంలో బహుమతులు పంచిపెట్టారు.




సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

సంపుటము **42**
సంచిక **48**


ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)


**Founder : K. NAGESWARA RAO**

వికృతి సంవత్సర నిజాషాఢ బహుళ చవితి బుధవారము


**ఈ జీవితమే ఒక సర్కస్:**— ఏది ఏమైనా, ఎటువంటి పరిస్థితుల్లోనూ ప్రభుత్వం ససేమిరా ధరల పెరగనివ్వదంటూ పారిశ్రామిక, సరఫరా శాఖలమంత్రి హెచ్. కె. మెహతాబ్ గారు అందుకు సంబంధించిన వారికందరికీ గట్టి హెచ్చరిక చేసినారు.

—నేషనల్ హెరాల్డ్



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ ఆగష్టునెల 2-వ తేది బుధవారము

# ఆత్మవిశ్వాసమే లోపము

విద్యాలయములందు విద్యార్థులకు ప్రవేశము నిచ్చునప్పుడు కుల మత విచక్షతలను పాటించుట నూతనరాజ్యాంగ నిబంధనల ప్రకారము అక్రమమైనదని మద్రాసు హైకోర్టు నిర్ణయించినది. ఇప్పుడు విద్యార్థుల విన్నపముపై హైకోర్టు రిట్ ఆఫ్ మాండమస్ జారీ చేసినందున, ప్రభుత్వము ఆ ఇరువురికి సంబంధించినంత వరకే ప్రావీణ్యతనుబట్టి వారి ప్రవేశార్హతలను నిర్ణయించి, తత్ప్రకార మొకరికి ఇంజనీరింగ్ కళాశాలయందు ప్రవేశ మొసగినది. అంతేకాని కళాశాలలందు కులమతములనుబట్టి నిర్ణయించిన నిష్పత్తిప్రకారము ప్రవేశముల నిర్ణయించు విధానమును మార్చదలచు కొన్నట్లు కానవచ్చుటలేదు.

హైకోర్టులో ప్రధానన్యాయమూర్తియు, ఇరువురు ఇతరన్యాయమూర్తులును ఏకగ్రీవముగ అక్రమమని నిర్ణయించిన కులనిష్పత్తిఉత్తరువును ప్రభుత్వము రద్దుపరచకుండుట నీతిబాహ్యము. బాధ్యత గల ప్రభుత్వ మీ రీతిని ప్రవర్తించుటవలన ప్రజల ఆదరణను కోలుపోగలదు. ఇట్టి ప్రభుత్వము ప్రజాస్వామ్య రాజ్యాంగవ్యవస్థను సంరక్షించగల దను విశ్వాసమును కోలుపోగలదు.

ప్రధానన్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారు తమ తీర్పునందిట్లు చెప్పిరి :

"రాజ్యాంగము నిర్మించబూనిన జాతీయజీవనమునకు ప్రాతిపదికగా రెండు ప్రధానాశయములను సాధించబూనినట్లు రాజ్యాంగమునం దంతర్భూతమై ఆదినుండి అంతమువరకును కానవగును. అది జీవన స్థాయిలోనే గాక అవకాశముల నొసగుటయందుగూడ సర్వసమత్వమును చేకూర్చవలె నను నది యొకటి; సాంఘిక, ఆర్థిక, రాజకీయవ్యవహారములయందు అందరకును సమధర్మములను వర్తింపచేయు సంఘవ్యవస్థను నిర్మించవలె ననునది మరియొకటి. ఇట్టి యాదర్శములను ప్రధానముగా పరిగణించుటవలననే, ప్రజలలో బలహీనస్థితిలో నున్న పతితులైయున్న వర్గములవారి నుద్ధరింపవలె నను విశేషచింతన ప్రత్యక్షముగ గోచరించుచున్నది."

పతితులను బలహీనులను ఉద్ధరింపవలె నను యత్నమున మన రాజ్యాంగనిర్మాతలు మద్రాసుప్రభుత్వమునకు తీసిపోలేదు. సమాజములో వివిధవర్గముల వారి స్థితిగతులను అకళింపుచేసుకొని, జాతీయావసరములను, జాతీయైక్యతావసరమును గమనించి, ప్రజాస్వామ్యసిద్ధాంతముల కనుగుణముగ, కర్తవ్యనిబద్ధవ్యష్టిస్వత్వములను పరిగణించియే రాజ్యాంగనిర్మాతలు రాజ్యాంగమును నిర్మించిరి. భ్రమావశమున కులనిష్పత్తివిధానముద్వారా మద్రాసుప్రభుత్వము సాధించదలచిన "సమాజసమధర్మమును" రాజ్యాంగనిర్మాతలు కర్తవ్యనిబద్ధ వ్యష్టిస్వత్వముల నొసగుటద్వారా సాధించ దలచినారు. హరిజనులు, వెనుకబడ్డతరగతులవారి ప్రయోజనమునిమిత్తము 16 వ నిబంధన మొదలగువాని నేర్పరచిన రాజ్యాంగనిర్మాతలు "సమాజ సమధర్మ" మును చేకూర్చు కర్తవ్యమును విస్మరించినారని మద్రాసుప్రభుత్వ మారోపించజాలదుగదా !

కాని ఉభయుల సాధనవిధానములును భిన్నములు. రాజ్యాంగనిర్మాతలు కులమతాదిభేదములచే సంభవించు వైషమ్యములను నివారించ యత్నించుచుండగా, భీతివివశులు, ఆత్మవిశ్వాసరహితులు నైన మద్రాసుప్రభుత్వాధిపతులు కులమతాదిభేదములను చిరస్థాయి నొనర్చి, కొన్నివర్గముల నణగద్రొక్కి మరి కొన్నివర్గముల నుద్ధరింపబూనినారు.

కాని అనేకదశాబ్దములుగ కులనిష్పత్తివిధానము వలని ప్రత్యేకసౌకర్యములను విశేషావకాశములను పొందుచున్న బ్రాహ్మణేతరహిందువులు ఈనాటికి గూడ బ్రాహ్మణులతో విద్యావిషయమున పోటీచేయలేకున్నారన్నచో, అట్టి కులనిష్పత్తివిధానము నిరర్థకమని వేరుగా నిరూపించవలసిన యగత్యము లేదు.

ఇంతే కాదు. కేవలము ఉద్ధరింపబడవలసిన వారికి విశేషసౌకర్యములను అవకాశములను ఇచ్చుటకే యేర్పాటయిన కులనిష్పత్తివిధానమువలన దేశమునకు తీరని హాని వాటిల్లుచున్నది. కేవలము కొన్ని వర్గములవారికి ఉపకారము చేకూర్చుటకై చేసిన ఈ యత్నమువలన దేశమున కులవైషమ్యములు చెలరేగుచున్నవి. మతాధారమైన ప్రత్యేకనియోజకవర్గముల వలన ముస్లింమతస్థులు హిందువులపై విశ్వాసమును గోల్పోయినట్లే, ఈ కులనిష్పత్తివిధానమువలన భిన్నకులములవారి మధ్య వైరములు సృష్టించబడుచున్నవి. ఇప్పటికే తమిళదేశమందు బ్రాహ్మణేతరవర్గములలో అతివాదులు కొందరు ద్రావిడస్థానవిభజనకొరకై ఆందోళన ప్రారంభింపచేసినారు.

లేని వైరములను కల్పించుటయే గాక నిత్యము లేహ్యములు సేవించుట కలవడి దేహారోగ్యమును కాపాడుకొను వ్యాధిగ్రస్తునివలె, బ్రాహ్మణేతరవర్గములవారు విద్యలో బ్రాహ్మణులకంటె నానాటికి వెనుకబడుచుండుటకు కులనిష్పత్తివిధానమే హేతువైన దని చెప్పవలసియున్నది. కులవివక్షతలతో క్రుగ్గిపోవుచున్న మద్రాసురాష్ట్రమున జీవనోపాధి లభింపచేసుకొనుటకై బ్రాహ్మణవిద్యార్థులు అహర్నిశలు పరిశ్రమ చేసి, కొందరు నూటికి నూరుమార్కులు కూడ సాధించగలుగుచున్నారు. ఇట్టివారిసంఖ్య నానాటికి పెరిగిపోవుచున్నది. కావుననే ప్రావీణ్యతనుబట్టి ప్రవేశమీయవలసినచో విద్యాలయము లన్నింటియందును సగముపైగా బ్రాహ్మణవిద్యార్థులకే ప్రవేశము లభించు పరిస్థితి ఈనాడేర్పడినది. కావున కులనిష్పత్తి యిట్లే మరి కొంతకాలము కొనసాగినచో, కొద్ది సంవత్సరములలోనే నూటికి నూరుమార్కులు తెచ్చుకొను బ్రాహ్మణవిద్యార్థులకుగూడ విద్యాలయములందు ప్రవేశములను నిరాకరించవలసిన యగత్యము కలుగనచ్చును. అనగా కులము బ్రాహ్మణకులమైనదోషమున సమర్థులైన యువకులకు అవకాశములను నిరాకరించి, వారి ప్రతిభను దేశావసరములకు కొరగాకుండ చేయవలసివచ్చుచున్నది. సమర్థులు నిర్వహించవలసిన దేశకార్యములను, పదవులను అసమర్థులైనవారికి (ఈ యసమర్థతయు సహజముగ వారి దోషము గాదు. ఇది కృత్రిమము) వారి కులము తెచ్చిపెట్టుచున్నది ఇది దేశమునకు అనర్థదాయకము. జాతీయైక్యతకు భంగకరము.

గాంధీమహాత్ముడు చెప్పినట్లు, ఒకరి కపకారము గావించి తద్వారా మరొకరికి ఉపకారము సాధించుటకల్ల. ఒకవర్గము నణగద్రొక్కి వారిని పతితులతో సమానస్థితికి తెచ్చుట, పతితుల నుద్ధరించుట గాజాలదు. అది సంఘము నధోగతిపాల్జేయును. పతితుల నుద్ధరించుట ప్రభుత్వకర్తవ్యము, సమాజకర్తవ్యమునుగూడ. అది సహకారస్నేహములవలననే ఒనగూడును గాని వైరములను పెంపొందించుటచే నొనగూడదు.

ఇప్పటికైన మద్రాసుమంత్రులు వాస్తవస్థితిగతులను తెలుసుకొని కళ్లు తెరచుట అవసరము. కులనిష్పత్తివిధానము కేవల మాశ్రితజనపక్షపాతమునకు, అసమర్థుల సంఖ్యను వృద్ధిపరచుటకే యుపయోగపడినది గాని, హరిజనులు మొదలుగాగలవారికి రవంతయైన ప్రయోజనకారి కాలేదు. సమాజసమధర్మప్రవర్తనమే ప్రభుత్వలక్ష్యము కావచ్చును. సహృదయముతోనే వారు కులనిష్పత్తివిధానము ననుసరించుచున్నా రని అంగీకరించవచ్చును.

కాని గాంధీమహాత్ముడు చెప్పినట్లు లక్ష్యమెంత ఉన్నతమైనదైనను, సాధనవిధానముగూడ ఉన్నతమైనదియు నీతిబద్ధమైనదియు గాకపోయిన లక్ష్య మసాధ్య మగును.

కనుక మద్రాసుమంత్రు లిప్పటికైనను ఆత్మవిశ్వాసమునుచిక్కబట్టుకొని, దోషభూయిష్టము, అభినీతికరము, జాతీయైక్యతాభంగహేతువు నైన కులనిష్పత్తివిధానమునకు స్వస్తిచెప్పి, బ్రాహ్మణేతరహిందువుల ప్రతిష్ఠను, ఆత్మవిశ్వాసమును కాపాడుట మేలు.

# ఆకలి

బీహారురాష్ట్రంలో ఆకలివల్ల కొందరు మరణించినా రని వార్తలు వచ్చినవి. మరణించినవారు ఆకలివలన మరణించలేదనీ వార్తలు వచ్చినవి. సరిగ్గా రెండేళ్ళక్రిందట ఆంధ్రదేశంలో కూడా ఇటువంటి వార్తలే వచ్చినవి. 'చోడవరంఆకలిచావు' లనే ఛలోక్తి కూడా దీనివలన వచ్చినది.

బీహారులో చోడవరంచావులు సంభవించినవో లేవో తెలియదుగాని, దక్షిణాదికి త్వరగా బియ్యం చేరకపోతే చావులు తప్పవని అనేకు లంటున్నారు. మన రాష్ట్రంలో ప్రభుత్వం అధీనంలో అయిదువారాలకు సరిపడే బియ్యపు నిలువలుమాత్రమే ఉన్నవని మంత్రి రోచ్‌విక్టోరియాగా రన్నారు. త్వరలోనే గోధుమలు, చిక్కినట్లయితే బియ్యము, పంపగలరని కేంద్రమంత్రి మున్షీగా రన్నారు.

ప్రస్తుత క్లిష్టపరిస్థితికి హేతువు కృష్ణా, ఉభయ గోదావరిజిల్లాలలో ధాన్యం కలవారు అమ్మకుండా దాచుకొంటున్నా రని ప్రభుత్వం సూచనమాత్రంగా తెలియచేసింది. దక్షిణాదికి బియ్యం పంపడానికిగాను తాడేపల్లిగూడెంనుంచి ప్రత్యేకపురైళ్లు ఏర్పాటుచేస్తున్నారుకూడా.

లోటు వచ్చేసరికి ఎవరిపైనో ఒకరిపైన నింద మోపడం అభ్యాసమయింది. నిందలేమోపడం ప్రధానమైతే, తంజావూరులో ధాన్యసేకరణ సరీతిగా జరిగినదీ కేంద్రప్రభుత్వోద్యోగు లిద్దరు విచారించి చెప్పిన మాటలను ప్రభుత్వానికి జ్ఞప్తికి తేవచ్చును. కాని పరిస్థితిని కానక చేసే పనులవలన ముమ్ముందు హాని తప్పదు. దాళవాపంటవలన వచ్చే ధాన్యంలో కొంత భాగాన్ని పెద్దపంటకు విత్తనాలుగా ఉపయోగిస్తారు మన రైతులు. దాళవాపంటలో అధికభాగం పేదరైతులకే మిగుల్తుంది. దీనిపై ఆధారపడి కిందటిసంవత్సరపు పంటలోని ధాన్యాన్ని అమ్ముకున్న రైతులవద్దనుంచి బలవంతంగా ఈ ధాన్యాన్ని సేకరించినట్లయితే ఈ రైతులకు ఆకలి తప్పనిసరే కావచ్చును.

ఎన్నడూ ఆహారానికి కొదువ లేని ప్రాంతంలో కొనడానికి బియ్యం లేవనే వార్తలు ఈమధ్య వచ్చినవి. ఆకలిఅరుపులు వినవస్తున్నవి. ప్రభుత్వం స్థానికావసరాలను కూడా శ్రద్ధగా గమనించి వ్యవహరించడం అవసరం.

---

# విషయానుక్రమణిక

## 2 ఆగస్టు 1950

# భూదేవతకి ప్రజలభారం దుర్భరంగా ఉన్నదా?



[యం. ఇల్యిన్ వ్యాసం ఆధారంగా]

భూమిపైన ఇప్పుడు 220 కోట్ల మానవులున్నారు. వీరిలో దాదాపు మూడింట ఒక్కవంతు జనలకే అనుదినమూ కడుపునిండా ఆహారం లభిస్తోందని అంచనా వెయ్యబడింది. ఆసియా, ఆఫ్రికా, దక్షిణఅమెరికా ఖండాలలో అనేకప్రాంతాలలో కరువనేది నిత్యాచారంగా ఉంది. అసలు పూర్వకాలంలో భారతదేశం కరువులకు పుట్టినిల్లని పేరు. హైటీద్వీపంలో పరిస్థితి చిత్రంగా ఉంటుంది. అక్కడ యాత్రీకులకోసం ఏర్పాటయిన హోటళ్లు భోగవిలాసాలకు స్వర్గావాసాలు. కాని దేశంఅంతటా దారిద్ర్యం చిటపట లాడుతూవుంటుంది. అమెరికాలో మట్టుకు దాదాపు కోటిమంది కడుపునిండా ఆహారం కొనుక్కోలేని స్థితిలో ఉన్నారని వెర్మాంట్ పెసేటర్ ఒక డీ మధ్య అన్నాడు.

లోకంలో ఈ దుర్భిక్షంగురించి అనేకమంది విజ్ఞానశాస్త్రవేత్తలు పరిశీలనచేసి అనేకగ్రంథాలు వ్రాశారు. అనేకరకాల సలహాలు ఇచ్చారు. కొందరు ఇంత జనాభాని భూదేవత భరించలేదనీ, అందరికీ ఆమె అన్నం ఇవ్వలేదనీ చెప్పారు. కొందరు ప్రకృతి ఇచ్చిన అపారసంపదను సద్వినియోగంచేసినట్లయితే అందరికీ కాక మరింతమంది కడుపునిండా అన్నంపెట్టి సకలసౌఖ్యాలు సమకూర్చవచ్చునన్నారు.

కార్నెల్ విశ్వవిద్యాలయానికి (అమెరికా) చెందిన ఇద్దరు ప్రొఫెసర్లు, పియర్సన్, హార్పర్ అనేవారు ఇటీవల "లోకంలో ఆకలి" అనే గ్రంథాన్ని ప్రచురించారు. ప్రపంచంలోని జనాభాలో కొంతకంతును తగ్గిస్తే కాని ఆకలి అనేది అనివార్యమని వీరి అభిప్రాయం. మహా అయితే 90 కోట్ల కంటె ఎక్కువ జనాభాని భూమి భరించలేదన్నారు. కొందరు ఇదీ ఎక్కువే నన్నారు. అంటే 50 కోట్ల కంటె ప్రజ ఎక్కువ ఉండకూడదని వీరి అభిప్రాయం. అంటే కనీసం నూరుకోట్లమంది ప్రజ అనవసరంగా భూమిపైన ఉన్నారని వీరి అభిప్రాయమన్నమాట.

ఈమధ్య బ్రిటిష్ శాస్త్రవేత్త జూలియన్ హక్స్లీ "వరల్డ్ రివ్యూ"లో జనాభాగురించి చర్చిస్తూ, ప్రతిదేశం జనాభా తరుగుదలకి యత్నాలు చెయ్యాలని సూచించాడు. ప్రతి మూడేసి సెకండ్లకీ ఇద్దరేసి చొప్పున లోకంలో జనాభా పెరిగిపోతుందనీ హక్స్లీ అంచనా.

జనాభాని తగ్గించడానికి యుద్ధా[illegible], వ్యాధులు, కరువులు మంచిపరికరాలనీ, వీటిని నివారించడానికి ప్రయత్నించడం వృథా అనీ పియర్సన్ హార్పర్ వ్రాశారు. జనాభా తమ గోదలకి మంచిమార్గాల్ని కనిపెట్టే వరకూ ఇవి తప్పవన్నారు.

అసలు డాక్టర్ల ఉనికే లోకానికి ముప్పు తెచ్చిపెడుతోందని విలియం వాట్ అనే అమెరికన్ ప్రొఫెసర్ అభిప్రాయపడుతున్నాడు. వ్యాధితో చనిపోవడానికి సిద్ధంగా ఉన్నవాళ్లకి చికిత్సచేసి బ్రతికించి జనాభా పెరుగుదలకి, దారిద్ర్యానికి డాక్టర్లు సహాయపడుతున్నారంటాడితను. ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉన్నవారికి పారితోషిక మిచ్చి నిస్సంతుల్ని చెయ్యడానికి చికిత్స చేయాలని ఇతని సూచన.

అమెరికన్ విదేశాంగశాఖవారి మధ్య కొన్ని అంచనాలు తయారుచేశారు. లోకంలో కల ప్రతిమనిషికీ కడుపునిండా ఆహారం పెట్టాలంటే మనిషికి రెండున్నర ఎకరాల చొప్పున భూమి సాగు కావాలని అంచనా వెయ్యబడింది. కాని వాస్తవంగా సాగవుతున్న భూమినీ, జనాభానీ చూస్తే ఇప్పుడు మనిషికి ఎకరం మాత్రమే సాగవుతున్నట్లు తేలింది.

అయితే సాగు కాగలిగిన భూమి ఇంతేకాదు. ఇంకా చాలావుందని అందరూ అంగీకరించిన విషయమే. మొత్తం భూమిలో సాగవుతున్నది నూరింట పదివంతులే. ఇందులోనూ నాలుగు వంతులే ఆహార ధాన్యాలు పండిస్తున్నారు. మిగతా ఆరు వంతులూ ఇతరపంటలు పండిస్తున్నారు.

వాస్తవానికి మొత్తం భూమిలో నూరింట 30 వంతులు సాగుకు పనికివచ్చేది ఉందని కొందరి అంచనా. అంటే పంటలు పండించే భూమిని మూడురెట్లు పెంచవచ్చునన్నమాట - అంటే మనిషికి ఎకరం చొప్పున కాక మూడెకరాలవరకూ సాగుచెయ్యడానికి వీలుంది. అంటే అందరికీ పెట్టగా ఇంకా అయిదోవంతు జనాభా పెరిగినా పెట్టగలడానికి వీలుంది.

---

ఇది కూడా ప్రస్తుతం సాగవుతున్న భూమిలో పండుతున్న పంట ఇంతే నని లెక్కగట్టితే, కాని సేద్యవిధానాన్ని సంస్కరిస్తే ఫలం అధికంగా లభించే అవకాశంకూడా ఉందన్నమాట మరిచిపోకూడదు. రష్యాలో కొన్ని ప్రాంతాల పంటను నాలుగురెట్లు పెంచగలిగారట.

మొత్తంమీద దాదాపు రెండున్నర రెట్లు ఫలసాయాన్ని సులువుగా పెంచడానికీ, సాగుచేసే భూమిని కూడా కనీసం మూడురెట్లు పెంచడానికీ, వీలుంటుందని కొందరి అంచనా. ఇలా చెయ్యగలిగితే ఇప్పుడున్న 220 కోట్లమందికి మాత్రమేగాక మొత్తం 660 కోట్లమందికి కడుపునిండా ఆహారం పెట్టవచ్చును.

ఈనాడు భూమిపైన పెద్దపెద్ద ఎడారులు, పచ్చికబయళ్ళు, అరణ్యాలు మానవులకు నిరర్థకంగా పడివున్నాయి. సారవంతమైన చదును భూమినే కాకుండా అవసరమైతే ఈ ప్రాంతాల్ని కూడా మానవుడు సంపద్వృద్ధికి వినియోగపరచవచ్చును. రష్యాలో సైబీరియా పచ్చిక ప్రాంతంలోనూ, కేంద్ర ఆసియాలోని అరణ్యాలలోనూ సేద్యం ప్రారంభించారు. ఆస్ట్రేలియా ఎడారిని ఫిరంగి శిక్షానిమిత్తం ఉపయోగిస్తున్నారు. దీనికి రెండున్నర కోట్ల పౌనులు వెచ్చిస్తున్నారు. ఈ ధనాన్ని బావులు తవ్వించడానికీ, భూమిని సాగుచేయించడానికీ వినియోగిస్తే అనేకవేలమందికి ఆహారం పెట్టవచ్చును.

ఉష్ణమండలం సువిశాలమైనది, అక్కడ ఫలాదులు పండించడానికి ఎక్కువ సౌకర్యాలున్నాయి. కాని ఈనాడు అనుకూల్ నదీ

(39-వ పేజీ చూడుడు)



తోళ్లను చదును చేయుచున్నారు.

# సామాజిక సేవా శిక్షణ

శ్రీ గజపతిరాయవర్మ

రాజకీయంగా - పరిపాలనాక్రమంలో స్వాతంత్ర్యం వచ్చినది అయితే దేశంలో ప్రజల స్థితిగతుల్లో, స్వాతంత్ర్యానందం కలికానికూడా దొరక్కపోవడం పరిజ్ఞానం గల పెద్దల ఆలోచనల కందినది. ప్రభుత్వం-ప్రజాప్రతినిధులం అనుకుంటున్న వారుకూడా వివిధ సమస్యలను గుర్తించారు మంత్రి ప్రభృతులు ఉపన్యాసాలూ వదిలేస్తున్నారు

కావాలి ఆర్థికంగా, మానసికంగా, సాంఘికంగా స్వలాభాపేక్ష కాన్పించని



పీలూరు తోళ్ల పరిశ్రమలో కార్మికుడు తోలు శుభ్రము చేయుచున్నాడు

శాస్త్రీయవిజ్ఞానానుభవాలు కలిగిన సంఘ సేవాపరులు సమాజాన్నుద్ధరించట క్కావాలి అని గుర్తించారు.

అంతేకాదు - ప్రజాసన్నిహితత్వంగల ప్రతివ్యక్తికీ, ఉద్యోగి, వ్యాపారి, ధన సంపన్నుడు ఇత్యాది విచక్షణలేకుండా - రాజకీయవాదులకు, ప్రజాప్రతినిధుల మనుకుంటు పాలకులకూడా ప్రారంభినిగా సాంఘిక సేవాశిక్షణ కావాలి అని నేనంటాను

కేవలం రాజకీయప్రాతినిధ్యం, పార్టీ ప్రాబల్యాలతో సాంఘిక సేవాశిక్షణ అంటూ కొన్ని కేంద్రాలు నడపకపోలేదు. మన రాజకీయాల్లో కష్టాల తక్కెడలు- కల్మషాలు సరియైన శిక్షణ నీయలేవు.



తోళ్ళ పరిశ్రమలో ఇదొక భాగం

పోతే దేశంలో ఒకే ఒక సంస్థ ఈ ప్రత్యేక విద్యకున్నది బొంబాయి "టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్" పారిశ్రామిక రంగంలో. వాణిజ్యవిషయాల్లో బహుముఖాలైయున్న టాటా సంస్థలకు అవసరమైనట్లుగా కొంత వారినిమిత్తమే అన్నట్లు ఈ సంస్థ నడిచినా – ఇటీవలినుండి యితర సంస్థలు – విశ్వకళాపరిషత్తులూ సోషియాలజీ ఎకనమిక్సు, లేబరు, సైకాలజీ, లెజిస్లేషను అన్ని విషయాల అవసరం గుర్తించి సోషియాలజీ గ్రూపు ఏర్పర్చినవి.

ఆవి మనప్రాంతీయులకు అందుబాటులో లేవు. సర్వీసుగిల్డు, సోషియల్ డిపార్టుమెంటు, పబ్లిక్ రిలేషన్సు, లేబరు వగైరాలదృష్టిలో – ప్రభుత్వం ఈ ప్రత్యేకశిక్షణ గలవారిని కోరటంలో మనయువకులిప్పుడిప్పుడూ ఈప్రత్యేక శిక్షణకు వెళ్ళుచున్నారు.

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు సంఘసేవా పరులుకొందరు జవ్వాది లక్ష్మయ్యనాయుడు, డాక్టరు ముల్లూరి రంగయ్య, మేకా రంగయ్య (కార్యదర్శి), డాక్టరు వి. జి. తిలక్, మొదలగువారి కృషితో "ప్రకాశ్ స్కూల్ ఆఫ్ సోషియల్ సైన్సెస్" ఏర్పడి టాటా వారి ప్రణాళిక, సహకారము, సలహాలతో సంస్థ నడిపారు.

సైకాలజీ, పాలటిక్సు, ఎకనమిక్సు, సోషియాలజీ, సోషియల్ ప్రాబ్లమ్సు, సోషియల్ లేబరు ఇన్సురెన్సు, లెజిస్లేచరు, సర్వీసు రూరల్ ఎకనమిక్సు, హెల్తు మున్నగు వివిధ విషయాల్లో శిక్షణ ఏర్పరిచారు. తమిళనాడు మైసూరు, ప్రాంతీయులకు విద్యార్థులతో మొదటి సంవత్సరం అనుకున్నంత గొప్పగా చేయకున్నా మేకా రంగయ్యగారి పట్టుదల వలన కొంత కృతకృత్యులైనారు.

టాటా ఇన్‌స్టిట్యూటు వారి డాక్టరు వాసుదేవమూర్తి, కాశీ విశ్వవిద్యాలయపు రానడే, రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రకాశ రావు, ఉస్మానియా కాలేజి పురుషోత్తమ నాయుడు, లక్ష్మణస్వామి, డాక్టరు తిలక్, డాక్టరు రంగయ్య ప్రభృతులు ఆయా ప్రత్యేకశాఖల్లో ఉత్తీర్ణులైనవారిచే శిక్షణ యిచ్చినారు.

ఆ సంస్థలో శిక్షణ పొందినప్పుడు తీసిన ఛాయాచిత్రాలు కొన్ని మిత్రుడు రాధామోహన్ వి.



ఫ్యాక్టరీచట్టము ననుసరించి పని చేసే వారిలో ఈ వయసు కుర్రవాళ్లు కూడ శ్రామికులగుటకు కారణం స్వతంత్రభారతపు ప్రజల దుస్థితి అనాలి.

# మనదేశం

## కులనిష్పత్తిపై హైకోర్టు ఆంక్ష *

విద్యాలయాల్లో విద్యార్థుల్ని ప్రవేశపెట్టడానికి కులనిష్పత్తిని పాటించడం నూతనరాజ్యాంగనిబంధనల ప్రకారం అక్రమమని మద్రాసు హైకోర్టులో ఛీఫ్ జస్టిస్ రాజమన్నార్, జస్టిస్ విశ్వనాథ శాస్త్రి, జస్టిస్ సోమసుందరంగార్లు రెండు కేసుల్లో విచారించి తీర్పుచెప్పారు.

ఇంజనీరింగ్ కాలేజిలో ప్రవేశానికి దరఖాస్తుపెట్టిన ఒక బ్రాహ్మణవిద్యార్థి సి. ఆర్. శ్రీనివాసన్, మెడికలు కాలేజిలో ప్రవేశానికి దరఖాస్తుపెట్టిన ఒక బ్రాహ్మణవిద్యార్థిని చంపకం దొరైరాజన్ తమ దరఖాస్తుల్ని కులనిష్పత్తిప్రకారం కాకుండా ప్రావీణ్యతను బట్టి పరిశీలించి ప్రవేశార్హత నిర్ణయించేవిధంగా మద్రాసుప్రభుత్వానికి ఆజ్ఞ ఇవ్వవలసిందని హైకోర్టులో అర్జీపెట్టుకున్నారు. ఈ కాలేజీల్లో విద్యార్థుల్ని ప్రవేశపెట్టడానికి ప్రస్తుతం మద్రాసుప్రభుత్వం అనుసరిస్తున్న కులనిష్పత్తివిధానం కొత్త రాజ్యాంగంలోని 15 (1) వ నిబంధన ప్రకారం, 29 (2) వ నిబంధనప్రకారం అక్రమమైనదని పిటిషన్‌దారుల వాదన. కాని రాజ్యాంగనిబంధనల్లోని 46 వ నిబంధనప్రకారం విద్యావిషయంలో హీనస్థితిలో ఉన్నవారిని ఉద్ధరించడం నిమిత్తం మద్రాసు ప్రభుత్వం కులనిష్పత్తి విధానాన్ని నిర్ణయించిందనీ, ఇది 29 (2) నిబంధనకుగాని 15 వ నిబంధనకుగాని వ్యతిరిక్తం కాదని మద్రాసు ప్రభుత్వం తరఫున ఎడ్వొకేట్ జనరల్ కుట్టికృష్ణమీనన్ గారు వాదించారు.

ఈ సందర్భంలో కులనిష్పత్తిప్రకారమైతే ఏయే కులాలవారికి ఎన్నెన్ని సీట్లు ఇవ్వడానికి వీలుపడుతున్నదో, అ ప్రకారం కాకుండా కేవలం ప్రావీణ్యతను బట్టి (అంటే పరీక్షల మార్కుల్ని బట్టి) సీట్లు ఇవ్వవలసివస్తే ఏయే కులాలవారి కెన్నెన్ని సీట్లు లభిస్తాయో మద్రాసు ప్రభుత్వం లెక్కలు తయారుచేసి చూపింది.

మద్రాసుప్రభుత్వం ఆధ్వర్యంకింద నడుస్తున్న నాలుగు మెడికల్ కాలేజీల్లోనూ మొత్తం సీట్లసంఖ్య 330. వీనిలో అన్యరాష్ట్రాల్లోంచి వచ్చేవారికి 317, ప్రభుత్వానికి న్యాయమని తోచినవారి కివ్వడానికి 12 సీట్లు. మొత్తం 29 మినహాయించబడతాయి. మిగిలిన 301 సీట్లను జనాభాల నిష్పత్తినిబట్టి ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక ప్రాంతాలమధ్య విభజించారు. నాలుగు ప్రాంతాల్లోనూ అయిదోవంతుకు తక్కువ కాకుండా స్త్రీల కివ్వాలని నిర్ణయించబడింది. ఇలాగే ఇంజనీరింగ్ కాలేజీల్లోకూడా. వీనిలో మొత్తం 395 సీట్లున్నాయి - 21 మినహాయింపులుపోగా మిగిలిన 374 సీట్లనీ కులనిష్పత్తిప్రకారం కాకుండా ప్రావీణ్యతనుబట్టి ఇచ్చినట్లయితే బ్రాహ్మణవిద్యార్థులకి 172 అధికంగా లభిస్తాయనీ, బ్రాహ్మణేతర (హరిజనేతర మహమ్మదీయేతర, క్రైస్తవేతర) విద్యార్థులకి 112 సీట్లు లోపించకుండా పోతాయనీ, హరిజనవిద్యార్థుల కిప్పుడిస్తున్న 25 సీట్లలో ఒక్కటీ లభించదనీ మద్రాసు ప్రభుత్వం నివేదించింది.

చర్చకు వచ్చినవి 15, 29, 46 రాజ్యాంగ నిబంధనలు. వీనిలో 15 వ నిబంధన ప్రకారం కులమతాదిభేదాలపైన వివక్షత నిషేధించబడింది. 29 (2) నిబంధన ప్రత్యేకం విద్యాలయాలకు సంబంధించినదీ ప్రభుత్వం నడిపే విద్యాలయాల్లోగాని, ప్రభుత్వంవల్ల ధనసహాయంపొందే విద్యాలయాల్లోగాని విద్యార్థుల్ని ప్రవేశపెట్టడంలో మతం, కులం, భాష, జాతిభేదాల్ని పాటించరాదని ఈ నిబంధనలవల్ల నిషేధించబడింది.

46 వ నిబంధన కేవలం రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రప్రభుత్వానికి సూచనల్లో చేరినది. సంఘంలో దుస్థితిలోఉన్న వర్గాలవారిని ఉద్ధరించడం ప్రభుత్వం కర్తవ్యం అని ఈ నిబంధన సూచిస్తున్నది. షెడ్యూల్డు తరగతులవారిని ఉద్ధరించేనిమిత్తం ప్రభుత్వాలు వీరికి అనుకూలంగా ప్రత్యేకసౌకర్యాలు ఏర్పాటుచేయవచ్చునని 16 వ నిబంధన విధిస్తున్నది.

29 (2) నిబంధనపైనా 46 వ నిబంధనపైనా వాగ్వివాదాలు జరిగాయి. కేవలం కులమతాదిభేదాల ఆధారం పైనే వివక్షత చూపరాదని 29 (12) నిబంధన విధిస్తున్నది. కులనిష్పత్తివిధానం కేవలం కులమతాల భేదాల ననుసరించే నిర్ణయించబడిందని అర్జీదార్లతరఫున వి. వి. శ్రీనివాసయ్యంగార్, అల్లాడి కృష్ణస్వామిగార్లు వాదించారు. వివక్షతకు కేవలం కులమతాలభేదాలు మాత్రమే ఆధారంకావనీ, సీట్లు తక్కువగా ఉండడం మొదలైన ఇతరఆధారాలుకూడా ఉన్నాయనీ, కాబట్టి ఈ కాలేజీల్లో విద్యార్థుల్ని ప్రవేశపెట్టే పద్ధతిని కులమతాల వివక్షతగా పరిగణించడానికి వీల్లేదనీ ఎడ్వొకేట్ జనరల్ వాదించారు.

కాని 231 మార్కులు మాత్రమే తెచ్చుకున్న హరిజనవిద్యార్థికి సీటు దొరికి, 390 మార్కులు తెచ్చుకున్న బ్రాహ్మణవిద్యార్థికి సీటు దొరక్కపోతే, అది కులవివక్షతే నవాలని చెప్పారు ఛీఫ్ జస్టిస్ రాజమన్నార్ గారు తీర్పులో. కాబట్టి 29/2 నిబంధన ప్రకారం కులనిష్పత్తివిధానం అక్రమమని వారు నిర్ణయించారు.

46 వ నిబంధన గురించి చర్చిస్తూ, మిగతా నిబంధనలకు లోబడే ఈ నిబంధనను అమలు జరపాలిగాని, వాని నతిక్రమించి 46 వ నిబంధనఅర్థాన్ని విస్తరింపచెయ్యరాదన్నారు.

వాస్తవానికి మద్రాసు ప్రభుత్వవాదాన్ని చూస్తే వారు కులవివక్షతఆరోపణని నిరాకరించడం లేదనీ, కాని సంఘంలో అందరికీ సమానంగా న్యాయం చేకూర్చడంకోసం దానిని సమర్థిస్తున్నారనీ రాజమన్నార్‌గారన్నారు. అయితే ఈ కులనిష్పత్తివిధానంవల్ల వారు కోరుతున్న 'సమాజన్యాయం' చేకూరుతున్నదా లేదా అని విచారించాలంటే 'సమాజన్యాయం' అనే మాట స్పష్టంగా లేదన్నారు. ప్రభుత్వం కులనిష్పత్తి విధానం వల్ల సంఘన్యాయం చేకూర్చగలుగుతున్నదని నిస్సంకోచంగా చెప్పడానికి ఆధారం లేదు. కులనిష్పత్తి అమలుజరపకపోతే సమాజంలో కొన్ని

(39-వ పేజీ చూడుడు)

కథానిక:

# క్రోధం



"ఏదికావస్తూంది. ఇంకా వంటకాలేదు కదూ" అన్నాడు ప్రొఫెసర్.

కుముద భర్తవంక ఒక్కసారి కన్నెత్తి చూసి, మళ్ళీ తిరగమోత వేస్తూవుంది. వినయము, ప్రేమ ఉట్టిపడేమాటలు ఆమె నాలికకొనదాకా వచ్చినై; కాని అక్కడే ఆగిపోయినై. ప్రొఫెసర్ ముఖాన కోపం గాని, విసుగుగాని ఆవంతకూడా లేదు. వారు కోపంగా వున్నారనుకుంది. ప్రేమపూరిత వాక్కులు నాలికకొసదాకా వచ్చినై. కాని సర్వకాల సర్వావస్థల్లోనూ విరాజిల్లే ఆస్నిగ్ధమందహాసం యెగరగొట్టివేసింది- తుఫాను యెండుటాకుల్ని తన్నుకు పోయినట్టు. ఆమెకు మండుకుపోయింది. మళ్ళీ అదే నవ్వు!

ప్రొఫెసర్ దగ్గరికివెళ్లి, ఆమెభుజంమీద

శ్రీ నన్నపనేని సుబ్బారావు

చెయివేశాడు. క్షణకాలం ఆమె శిరోజాల పటునిటు కదిలిచ్చాడు. కుముద ఏమీ మాట్లాడలేదు. ఆమెకు లోలోపలే రగులుకుపోతూవుంది. పతిస్పర్శ తనకింత వెగటుగా, అప్రియంగా వున్నందుకు ఆమె ఆశ్చర్యపడింది. కాని ఆమె, చేతిని తీసి వెయ్యలేదు. చైతన్యరహితమయిన శిలాప్రతిమవలె శాంతంగా వుండటానికి ప్రయత్నించింది. ఒకసారి భర్తవంక తిరిగి జవాబిద్దామనుకుని మళ్లీ వూరుకుంది. వారి ముఖంమీద ఎప్పటిమాదిరిచిరునవ్వే ప్రత్యక్షమవుతుందేమో; కుముదకి ఆ చిరునవ్వు చూస్తే తగని చిరాకు! ఎందుకంటే ఆచిరునవ్వు ముందు ఆమె నిరుత్తరురాలు, వివశురాలయేది. వివశత్వంతో, చిరాకుతో, విచిత్రమయిన వ్యథతో నిండిపోయి, హఠాత్తుగా ఆమెకు కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగినై. అప్పుడే ప్రొఫెసర్ ఆమెముఖం తన వంక తిప్పుకున్నాడు. ఆమె నేత్రాల్లోని కన్నీరు చూసి, అవి పశ్చాత్తాపమువల్ల కలిగిన అశ్రువులని భావించి, ప్రొఫెసరుమనసు కరిగిపోయింది." "ఛీ, నువ్వూ బలేదానివి! ఎందుకు? నేనేమీ అనలేదే! నాకేమీ కష్టమనిపించలేదే!" అన్నాడు ప్రొఫెసర్.

ఒక్కొక్కశబ్దం వొక్కొక్క బాణం లాగా ఆమెహృదయాన్ని చీల్చుకుపోతూ వుంది; వివశత్వము, చిరాకుతో కూడిన వ్యధనుకూడా యినుమడింప చేస్తూ వుంది. 'నేనేమీ అనలేదే!' ఏమీ అనకపోవటమేగా యీ వేదనకు హేతువు! 'నాకేమీ కష్టమనిపించలేదే!' ఇదేగా దుఃఖానికి మూలం! మన మనసులో యిలాంటి విషయాలు కల్పనారూపంలో కాక, అనుభూతిలో ఉత్పాతంవలె వస్తవి. సాధారణంగా మనం వీటిని అర్థం చేసుకోలేం. లేక అర్థంచేసుకోవటానికి యిష్టపడం!

చివరికి కుముద పట్టలేక, ముఖంచటాలున తిప్పుకుని, నిర్దాక్షిణ్యంగా ప్రొఫెసరుచేతిని విదిలించివేసింది.

ప్రొఫెసర్ నిశ్చేష్టుడయాడు. భార్య కఠోరత యిప్పటికి బోధపడింది. చాలా క్షుబ్ధుడయాడు; కాని అంతకంటె యెక్కువ ఆశ్చర్యపోయాడు. తానేం చేశాడు? చాలా బాధపడ్డాడు. ఉన్నత విద్య అతనికి మనోవికారాల్ని నిగ్రహించుకునే శక్తిని ప్రసాదించింది. అయినా పురుషుడు! మనస్సు విచలితమై, గంభీరస్వరంతో "కుముదా!" అన్నాడు.

కుముద ఆక్రోశం పట్టలేక, విసవిస నంటూ, భర్తవంక కన్నెత్తి చూడకుండానే వెళ్ళిపోయింది.

ప్రొఫెసర్ హతబుద్ధియై కాసేపు నిశ్చబ్దంగా అక్కడే నిలబడిపోయాడు. తర్వాత కోపంతో కంపించిపోయాడు. పాల పొంగులాగా ముక్కోపులకు కోపం రావటమూ తొందరే, చల్లారటమూ తొందరే! కాని కొంతమందికి ఎప్పుడోగాని కోపం రాదు; వచ్చినప్పుడు మాత్రం వెంటనే చల్లారదు. మనిషే తరుమారై పోతాడు.

ప్రొఫెసర్ యెంగిలిపడకుండానే కాలేజికి వెళ్ళిపోయాడు. కుముదకూడా అలానే పోయి పడుకుంది. పొయ్యిమీద కూర మాడి, మసైపోయింది. కాసేపటికి పొయ్యి కూడా ఆరిపోయింది.

ప్రొఫెసర్ ఇవాళ కోపంతో—స్వభావానికి వ్యతిరేకంగా—కాలేజికి వెళ్ళాడని కుముదకి సరిగ్గా తెలియలేదు. వేళకి వంట కాకపోతే, భోజనం చేయకుండానే కాలేజీకి చాలాసార్లు వెళ్ళాడు. కాని ఎన్నడూ కోపం అనేది ఎరగడు.

ఆమె చాలాసేపు పడుకుని ఆలోచిస్తూ వుంది. కాని తను ఏమి ఆలోచిస్తోందో ఆమెకే సరిగ్గా తెలీదు. ఆమెకి హృదయ వేదన క్రమంగా దుర్భరమవుతుంది. అందువల్ల వూపిరి పీల్చుకోటం కూడా కష్టంగా వుంది. ఎంతోసేపు వెక్కి వెక్కి ఏడ్చింది. తలగడ తడిసి ముద్దయిపోయింది. వర్షం కురిసినాక వుమ్మరింత తగ్గినట్టు, మబ్బులు విడిపోయినట్టు, ఏడ్చినపిమ్మట ఆబయవు కొంత తేలికైన మాదిరిగావుంది.

ఆమె మనసు కలకతేరింది. గతజీవితంలోని కొన్ని ఘట్టాలు వరసతేరి చిత్రాల మాదిరిగా మనోవీధిని తిరుగాడుతున్నాయి. పెళ్ళికి పూర్వపుచిత్రాలు కొన్ని ప్రత్యక్షమయినై. ఆ రోజుల్లో తను ఏమికలలు కంటూవుండేదో, గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నం చేస్తూవుంది. తనకి గుర్తున్నంత వరకు ఆ రోజుల్లో ప్రత్యేకంగా దేన్నిగురించీ ఆలోచించేది కాదు. ఎప్పుడూ కేరింతలు కొడుతూ పొద్దు పుచ్చేది.

తిన్నగా రోడ్డుమీద నడిచేది కాదు. స్ప్రింగ్ లాగా ఎగురుతూ పోయేది. అప్పుడప్పుడు ఆమెకి చిత్రమైన ఆలోచనలు కలిగేవి. "ముందు ముందు ఏమి జరుగుతుందో! ఎలావుంటుందో!" ఆ సమయంలో కుతూహలం, భయసందేహాలు ముప్పిరిగొనేవి!

తర్వాత పెళ్ళిఅయింది. పెళ్ళి అయి ఇప్పటికి నాలుగేళ్ళయింది. ప్రథమవసంతం సుఖంగా గడిచిపోయింది; ఆమె కోరిన సమస్తమూ భర్తవద్ద ఆమెకు ప్రాప్తమయింది. అందులో నిమగ్నమై తన అదృష్టాన్ని కొనియాడుతూ వుండేది. రెండోసంవత్సరం తనకి భర్తవల్ల లభించవలసింది చాలా వున్నట్టు నెమ్మదిగా బోధపడుతూవచ్చింది. భర్తలో ఏదో లోటు వుందని ఆమెకి తోచేది. రోజులు గడిచిన కొద్దీ ఈలోటు భరించుటం దుర్భరంగా కనిపించసాగింది. కాని ఆలోటు ఏమిటో నేటికీ ఆమెకి సరిగా అర్థంకాలేదు. ఇవాళ తానెందుకు ఇలా యేడ్చిందో యెంత ఆలోచించినా జవాబు రాలేదు. అందువల్లనే యీ వేదన మరీ దుస్సహమైపోయింది.

హఠాత్తుగా ఆమెకి భర్తముఖం గుర్తుకొచ్చింది. పెదవులమీది మందహాసం తలపుకొచ్చి, కుముద అగ్నిహోత్రమయింది. తనవల్ల ఎంత పెద్ద పొరపాటు జరిగినా, కోపం రావటానికి ఎటువంటి అవకాశాన్ని కల్పించినా, అతని ముఖంలో ఎప్పుడూ ఆ చిరునవ్వే ప్రత్యక్షమయేది. ఆ నవ్వుముందు ఆమె బాణాలన్నీ గురిగాకుండా పోయేవి. అదొక దుర్భేద్యమయిన కవచంలాగా వుంది; దాన్ని భేదించుకుని ఆమె భర్తవద్దకి చేరలేక పోతూంది. అదీగాక ఆమె అర్ధాంగి, అతని సంపూర్ణ ఆస్తిత్వంలో పాలు పంచుకోటానికి ఆమెకి హక్కుంది. భర్తహృదయాన్ని నగ్నరూపంలో తనదిగా చేసుకోవాలనుకుంటుంది. కాని తనవల్ల యేలోటు జరిగినా, ఆమందహాసంమాత్రం చలించేది కాదు. పెద్దలు పిన్నల తప్పుల్ని మన్నించాలనే భావం దానిలో వున్నట్టుంది. కుముద దీన్ని గ్రహించి మరీ మండిపడేది. అసలు ఆయనకి ఎందుకు కోపంరాదు? ఎందుకు విసుక్కోడు? యోచించిన మీదట, విషయను ప్రేమవల్ల లభించే మన్ననలో అన్యాతరసం వుండవచ్చును కాని, స్వతహాగా లక్షించేదానిలో యెక్కువసించి వస్తుంది? కుముదకి ఈ రకమైన మన్నింపు అంటేనే శత్రుభావం ఏర్పడింది. కొంతమందికి యిలాంటి లతప్పులమీద ముద్దువస్తుంది కాని, వీరికి తెగించటం తలపుకొస్తుంది. ఒక్కొక సారి కోపంవచ్చి, చాలా కఠోరంగా మాట్లాడేది. కాని యెందుకో పైకి వెన్న రాస్తే, మస్తకమట్టు, ఆస్నిగ్ధహాసంముందు ఆమె పలాగ అయేది. కరుకుతనం. స్నిగ్ధతని కరుకెక్కించలేదు కాని, స్నిగ్ధత కరుకుతనాన్ని పోగొట్టగలదు. ఇంక చేసేదిలేక, తన అసమర్థతకి, పరాజయానికి కుమిలిపోయేది; తర్వాత పగటుతో ఆమె మనసు తిక్తమైపోయేది. చివరికి అమోఘమైన రామబాణం – ఏకాంతంగా కూచుని ఏడవటం – ఆమెకి మనశ్శాంతిని ప్రసాదించేది!

కుముద కాలేజీలో చదువుకోటంవల్ల, తరచుగా తన మనోభావాల్ని వ్యాఖ్యానించుకుంటూ వుండేది. ప్రతిసారి ఒకే నిర్ణయానికి వచ్చేది. తను ప్రసన్నురాలు కావటానికి, అసంతుష్టి చెందటానికి, తగిన కారణం ఏమీ లేదు! కాని తర్కంతో ఆమె హృదయం తృప్తిపడేది కాదు. కాలేజీలో చదివినప్పుడు చెలికత్తెల మనస్తత్వం బాగా గుర్తుంది. వారు తనస్థానంలోవుంటే, చాలా సంతుష్టి చెందేవాళ్ళని ఆమె తరచు అనుకుంటూవుండేది. ఒక కవినో, రచయితనో పెళ్ళాడవచ్చుని అంటున్న వేళాకోళం చేసేది. ఆయనలో రచయిత కుండవలసిన లక్షణాలన్నీ వుంటవి. ఆయన గుడ్డలు మాసినా, గడ్డం పెరిగినా తనకి కాదులే అన్నట్టుంటాడు; భార్యని పరిహాస మాడుతుంది. వస్తువులు ఎక్కడపడితే అక్కడ పారవేస్తే, ఆమె వాటిని సర్దుతుంది; వారికి కోపంవచ్చి పలకరించటం మానివేస్తే, బతిమాలుకుంటుంది. వారు రావటం ఆలస్యమయితే, భోజనముందు పెట్టుకుని వారికోసం ఎదురు చూస్తుంటుంది; కోపంవచ్చి ఒగ్గు ... భయంతో వణికిస్తుంది. మాసినవాళ్ళు లేకపోతే, టేబిలుమీద పుస్తకాలు చిందరవందరై, దుమ్ము కొట్టుకున్నట్టు, కుముదమనస్సులోని (చెలికత్తెలని యెగతాళి చేసిన యీ సంకల్పాలు, కొన్నేళ్ళు ఒక క్రమం లేకుండా చెదరిపడి వున్నవి; వాటినూతి సత్వం పోయి, కుళ్ళిపట్టసాగింది. కుముద ప్రసన్నురాలు చేయటానికి కాలసంబంధం ... కాని ... కాదు. కుముద

(౩౮-వ పేజీ చూడుడు)






శ్రీ నోరి నరసింహశాస్త్రి

౪౨

యథావాక్యము అన్నమయ్యకొప్పిన్నికి గురియైన శ్రీవైష్ణవాగ్రేసరుడు కన్నులు పోయి యన్నమేశ్వరుని యాలయము ముందు పడిపోవునుగదా! అతని వెంట వచ్చిన వైష్ణవతండము పారిపోయినది. ఆ పడిపోయినవానియొద్దకు పోవుటకు అన్నమేశ్వరుని యాలయము ముందున్న శివభక్తులుకూడ సాహసింపలేదు. అన్నమయ్య కొంతవడికి రోజుచు తన రెండుకన్నులు గట్టిగా మూసికొని, వెనుకకు శివనిందకుని దిక్కు ఇంతవరకు తిరిగి యున్నవాడు, మరల ఈశ్వరునివంకకు తిరిగి భక్తివినమ్రుడై నమస్కరించి శివపూజ సాగించెను.

ఈకథ పట్టణమంతయు ప్రాకిపోయినది. ఎందరో ఆ వింత చూచుటకు వచ్చిరి. జనసమ్మర్దము నిరంతరముగా నుండు నాప్రదేశమున, మరియు విశేషముగా జనము మూగిరి. అంత జనము మూగినను అందులో నెవ్వరును కన్నులు పోయి పడిపోయిన యా శ్రీవైష్ణవుని సమీపింపరు. వారి కలుపు పోవుటకే భయము. భయముసంగతి యెటులున్న కన్నులు పోయి పడిపోయినవాడే యని జాలి నందువారైన నక్కడ లేరు. పైగా శివనింద చేసినవానికి ప్రాయశ్చిత్తమైనదనువారే అందరును! అపరాధులు శిక్ష యనుభవించుచుండ వారిపై జాలినొందు నిర్వీర్యస్థితిలో లేరు ఏకశిలానగరపౌరులు! శ్రీవైష్ణవులకు ఆ చాయకు వచ్చుటకుగూడ ముఖము చెల్లలేదు.

ఒరి యాతనివెంట నందరు వైష్ణవులు వచ్చియుండిరే! అతడును శ్రీవైష్ణవునివలెనే యుండెనే! ఈవార్త ఏకశిలానగరములో వీథివీథుల వాడవాడల ప్రాకిపోయినదే! ఎవరును అతనివారు రారేమి? అతనికి భార్యగాని బిడ్డలుగాని లేరా? తల్లిగాని తండ్రిగాని లేరా? అన్నలు దమ్ములు అక్కలు చెల్లెండ్రునుగూడ లేరా? ఎవరునుగూడ లేరా? ఇతడసలు శ్రీవైష్ణవుడే యగునా?

*   *   *   *

ఆనాడు రెండు జాములకు కొంచెము ముందుగా మాచల్దేవి తన చేటికతోడను కొంత పరివారముతోడను కేశవస్వామిని దర్శించుటకు అరుదెంచెను. అది స్వామిసేవ చేసికొన్నది; ఆనందపారవశ్యముతో నొకగీతము నృత్యము స్వామికి ప్రదర్శించి కానుక లర్పించుచున్నది. పిమ్మట నది స్వయంభూ దేవులను గూడ దర్శించి కానుక లర్పించి యాలయప్రాంగణమున సంచుక విశ్రమించినది.

అంతలో మండపమునుండి తిక్కనసోమయాజులు మహాభారత రచనము ఆ పూటకు చాలించి మారన గురునాథునితో కలసి వెళ్లుట చూచి యది సంభ్రమమున లేచి వారికి మ్రొక్కి సోమయాజుల దయావలోకనప్రసాదము పొందినది.

అట్లది యక్కడనుండి గృహోన్ముఖముగా మరలిపోనుండగా, నావల అన్నమేశ్వరుని యాలయముముందు శివనింద చేసిన శ్రీవైష్ణవు డొకడు కన్నులుపోయి పడిపోయెనను వార్త విన్నది. పోయి చూడవలెనను వేడుక మాచల్దేవికి కలిగినది.

అది తన చేటికతో పోయి చూచునుగదా, వెంటనే యాతడు శ్రీవైష్ణవుడు కాడని యది నిర్ణయించెను. వెనుక విజయదశమినాడు కౌముదీజాగరణోత్సవము వేళ తన యింట కొంతవడి వాదమాడి తుదకు పర్వతనాయకునితో ఖడ్గయుద్ధము చేసిన అజ్ఞాతయోగియే యాతడని దానికి తెలిసిపోయినది. చేటికగూడ గుర్తించినట్లున్నది. దాని కన్నులు ఆ గుర్తించుటలో నాశ్చర్యసంభ్రమములతో రెండింతలు కాగా, మాచల్దేవివంక తిరిగి 'అక్కా!—' అని యేమో యనబోవుచుండెను. కాని వెంటనే మాచల్దేవి మాటావడద్దని చేసిన కనుసన్న నందుకొని యది నోరు కట్టివేసికొనెను.

ఏమిది? ఇతనికీ వేషమేమి? మహాయోగియైనచో ఈ శివనింద యేమి, ఈ శిక్ష యేమి? ఈమనుష్యుని వేషభాషలతో, నింత లోకజ్ఞానముగల తానే మోసపోయినదా? ఇతని కేమి లోపమున్నను కామమోహితుడగుట యను లోపము లేదు. ఎట్టి మహానుభావులను కామమోహితులగుట దాని కనుభవము. కామము నిర్జించిన యీ యోగియందు తన కందుచే విశేషగౌరవము కలిగినది!

ఆ రాత్రి రోషావేశముతో పర్వతనాయకుడు పట్టుకొనగా నాతని చేతిలోనికి వచ్చిన జుట్టు కృత్రిమమైనది. ఆ కృత్రిమకేశపాశము అనేకవిధముగా నుండెను. మరి యీనాడీతడు ధరించినది కర్ణాట శ్రీ వైష్ణవుల కేశబంధమువలెనే యున్నది. కేశబంధమే యేమి? అతని వేషమంతయు నట్లే యున్నది. ఏమి యీ ద్వాదశోర్ధ్వపుండ్రములు? శ్రీవైష్ణవులనుగూడ తన వేషముతో వారిలో నొకడనని నమ్మించినట్లున్న దీవేషము! ఇతడెవరో గూఢచారుడై యుండవలెను. ఇతని నెరిగినట్లు కనబడుట ప్రమాదకరము!

ఈ యూహాలన్నియు మాచల్దేవిమనస్సులో ప్రసరించెను.

వెంటనే చేటిపంకకు తిరిగి, 'చెల్లీ! భగవద్దర్శనఫలము చూచినావా!' అనుచు దానిని తోడుకొని మావద్దవిడిచి వెడలిపోయినది.

*　　*　　*　　*

సాయంత్రము మూడుజాము లైనది. అక్కడికి మూడవచ్చు జనసమ్మర్దము తగ్గిపోయినది. బొల్లని భార్య మంగి తనకూతురు పాటితో కలసి యక్కడికి వచ్చినది. అప్పటికిని ఆ కన్నులు పోయిన గూఢచరుడు ఏకాకియై యక్కడనే పడియుండెను. ఆప్తు లెవ్వరును అక్కడికి వచ్చినట్లే లేదు.

పడియున్న యాతని జూడగనే మంగికి దుఃఖము ముంచుకొని వచ్చినది. దాని కాతనిపై తండ్రియందువలెనే ప్రేమ గౌరవము వినయము భక్తియు కలవు.

పూర్వ మొకమారు దాని యింట వరుసగా మూన్నాళ్లు ఆహారము లేకుండెను. దాని బంధువులే దానియొద్దకు వచ్చుటకు వెరచుచుండిరి. అది సహాయ మర్థింపబోయిన దాని దగ్గరవారే పెడమొగములు పెట్టిరి. భిక్షమునకు పోవుటకు దానికి మన సొప్పలేదు. అందులో కూతురు పాటికి జ్వరముకూడ వచ్చినది. పిచ్చిమాటలు వెర్రిమాటలు! అది ముఖ్యముగా తండ్రికై దిగులుపడినది. తండ్రినే ఆ సంధిలోకూడ పలవరించును. మంగికి కాళ్లాడలేదు.

మూడవనాటి సాయంత్రమున కది యొక నిశ్చయమునకు వచ్చుచుండెను. మరునా డది కూలికో భిక్షమునకో పోవలెను. భిక్షమా? కూలికి పోవుటా? రాతికోట కట్టుటకు కూలీలు ఎవ్వరైనను ఎందరైనను కావలెను. కాని స్త్రీలు ఆ పనిలో ఎక్కువమంది లేరు. ఒక్కమారు ఆ పనిలోనికి దిగినచో రాజభటులు పని పూర్తియగువరకు పని చాలింపనీయరు. కోట పూర్తియగువరకు నొకవిధమగు నిర్బంధమే. మరి యది ఎన్నాళ్ళకు పూర్తి యగునో! అంతవరకు తా నా పనిలో నిరుకుకొనిన నెట్లు? మరి యీ యాకలిబాధ భరించుట ఎట్లు? తన్ను తన కుమార్తెను పోషించుకొనుట ఎట్లు?

అట్లాలోచించుకొనుచుండగా ప్రొద్దుక్రుంకినతర్వాత ఎవరో ఎరుగని మనుష్యుడు వచ్చి, 'నీ వీ రాత్రి నిద్దురపోకుము. శుభమగును!' అని మాత్రము చెప్పి మరి మాటాడక కనబడకుండ పోయెను.

ఏమిది? ఎవ రిది? ఒకప్రక్కను 'పాటి' కి సంధించిన జ్వర మట్లే యున్నది. మంగిమనస్సు ప్రపంచమంతయు సంచరింపసాగినది. బొల్ల డెక్కడ నున్నాడు? ఈ విశాలప్రపంచములో నెక్కడ నున్నాడో? తన్ను తన కూతును మరచినాడేమో? రాజభటులచే జిక్కి ఏమి బాధలు పడుచున్నాడో! అతడు చెరసాలకు గొంపోబడినదియు నాతని నెవ్వరో తప్పించినదియుమాత్రమే దానికి తెలియును. ఆపై నేమియు నెరుగదు. ఆ తప్పించినవాడు తన వైపైన చూచుటలేదే? వారికే తనపైగూడ కరుణ కలిగినదేమో! కాక తన విభుడు బొల్లడే రహస్యముగ వచ్చునా?

ఆరాత్రి కంటిపై కునుకు రాకుండ నిద్ర కాచి మేలుకొని యున్నది. అర్ధరాత్రము దాటినది. ఏమియు లేదు. ఆశ సన్నగిల్లినది. ఎంత యాపినను ఆగకుండ నిదురవచ్చుచున్నది. ప్రయత్నపూర్వకముగా మేలుకొని యున్నది.

కూర్చుండి యుండగనే ఒక కల వచ్చినది. మేలుకొన్నవారికి కలలు వచ్చునా? దానికి నిదురపట్టియుండవచ్చును. ఒక్క రెప్పపాటుకాలము కునుకు పట్టిన చాలును. ఆ కొంచెముకాలములో మరియొక జీవితకాలము కలలో గడచిపోవచ్చును. కాని మంగికి వచ్చినది చిన్న కలయే! పెనుభూతమువలె జడలు విరియబోసికొని యున్న యొక యాకారము కన్నులముందు కనబడినది. దాని కెన్నో చేతులు. ఆ చేతులం దన్నిట ఖడ్గము లున్నవి. అవి యన్నియు నొకచో కలసినవి. కలసియున్న యా ఖడ్గములు చూడగా ఒక భుశుండి యాకారము ధరించినవి. అంతలో ఒక పెద్ద చప్పుడైనది. అది యా కత్తులన్నియు విరిగిన చప్పుడా?

కొట్టినట్లు మంగికి తెలివి వచ్చినది. పూర్వవర్తితుడైన నిశాచరయోగి యాయసదండము కొట్టుచు చేసిన చప్పుడు, అది! అతడాధ్వని చేయుచు చేసిన సంచారమెల్ల మంగి శ్రద్ధగా నాలకించెను. ఈ భయంకరధ్వనిరూపముగా తన కానాడు శుభము రాబోవుచున్నదా? ఏమో!

తిరిగితిరిగి యా శబ్దము తన కుటీరమువైపునకే వచ్చియాగినది. అప్పటికే పేరాసతో మంగి తలుపు తీసినది. ఆ భిక్షువును చూడగానే మంగికి నిరాశ నిస్పృహ కలిగినవి. ఈ భిక్షువువలన తన కేమి లాభ ముండును? అతని యాశీర్వాదము పొందుటకైనను, భిక్షము పెట్టను గింజకూడ తన యింటిలో లేదు. ఏమి చేయును?

తుదకా భిక్షువే దానికి శుభవార్తలు చెప్పెను. చెప్పి యంతటితో నూరకొనక దోసెడు సువర్ణము లిచ్చియుండెను. ఆ సువర్ణములను అతని కెట్లు వచ్చినవి? ఆకాశములోనుండి యాతడు పిలిచినంతనే ఎవరో యక్షు లాతని దోసిలిలో పోసిన ట్లున్నారు. అవి యాతడు తన కీయగా నది నిజ మని దానికి ముందు నమ్మకము కలుగలేదు. తీసికొన్నది. నిజముగానే శుభము దాని కా రాత్రి వచ్చినది. ఆ పిమ్మట మనస్సు ఆందోళనముతో దానికి నిద్దుర పట్టలేదు.

ఆపిమ్మట దానికి దారిద్ర్యము పోయినది. తదాది పొదుపుగా ఆ సువర్ణములు వాడుకొనుచు జీవించుచున్నది. పాటికి మరిరెండు రోజులకు జ్వరము నయమైనది.

అట్టి మహానుభావుడు ఈనాడు ఇట్లు నడివీధిలో దిక్కులేక కన్నులు పోయి పడియున్నాడు. తనకువలెనే ఈతడు మరియెందరు బీదలకు ఉపకారము చేసియుండెనో? వారిలో ఒక్కరును ఇప్పు డిక్కడికి రాలేదు. అతనిని వదలక సమీపముననే కూర్చుండి మంగి పెద్దపెట్టున నేడువసాగెను. దానికి కారణము తెలిసిపోయినది. పాటి దానిని పైటకొంగు లాగుచు ఇంటికి పోవుద మని తొందరపెట్టుచున్నది.

సాయంకాల మైనది. దీపములు దేవాలయములలో వెలిగించిరి. తిక్కనసోమయాజి మారన గురునాథులతో కలసి స్వయంభూదేవాలయమండపమునుండి ,యున్న మంత్రియింటికి చేరుటకు బయలుదేరి యా మార్గమున బోవుచుండెను. మంగికి దూరమున సోమయాజులను చూడగనే ఆ మహానుభావుని రక్షింపు మని వేడుకొనవలె నను నిచ్ఛ జనించెను. అది ఎదురుపోయి సోమయాజుల రెండుకాళ్లు గట్టిగ పట్టుకొని విడువక వెక్కివెక్కి ఏడువసాగినది.

సోమయాజులకు ఆశ్చర్యముతోపాటు జాలి కలిగెను. దీనముగా నవదయై యేడ్చు మంగిస్థితిని చూచిన ఎవరికి జాలి కలుగదు? అందులో కరుణాళువు లగువారికి జాలి కలుగదా?

తిక్కనసోమయాజుల కా ఉదయమున జరిగిన కథ చూచాయగా తెలిసినదేగాని సరిగా తెలియలేదు. ఏమని విచారింపగా అక్కడి జనము ఉదయము జరిగినది చెప్పివేసిరి. అంతయు విని సోమయాజులు "నన్నేమి చేయుమందువు?" అని మంగిని ప్రశ్నించెను.

"రక్షించు, స్వామీ, ఆయన కళ్లు తెప్పించు, స్వామీ! మీకు పుణ్యముండును!"

"అతడు నీ కేమగును?"—సోమయాజి ప్రశ్న.

"అతడు నా తండ్రి, స్వామీ! నా బోటి దిక్కులేని పక్షుల కందరికీ తండ్రివంటివాడు స్వామీ!"

సోమయాజులు ఇంచుక ధ్యానించెను.

"అమ్మా! ఇతడు శివనింద చేసి ఈ స్థితికి వచ్చినాడు. అన్నమేశ్వరునికి మ్రొక్కకొని ఆ యాలయములో నన్న యభారాధ్యుల అన్నమయ్యను క్షమాభిక్ష యర్థింపుము. సర్వము శుభమగును!"

వెంటనే మంగి యాతని పాదములు వదలి అన్నమేశ్వరుని యాలయము ముందు నిలుచుండియున్న యన్నమారాధ్యుల పాదములపై బడి పరిపరివిధముల ప్రార్థించెను. కొంతవడికి అన్నమారాధ్యులకును జాలి కలిగినది. శివలింగార్పితమైన దివ్యజ్యోతిని ఆ పడియున్నవాని కన్నులపై ప్రసరింపజేసెను. ఆ పడియున్నవాడు కన్నులు నలుముకొనుచు లేచెను.

'మంగి యన్నమారాధ్యులకు మ్రొక్కి 'బాబా, లేచితివా?' యని యా శ్రీవైష్ణవవేషధారిని పలికించెను. అతడు కన్నులు తెరచినాడు. లేచినాడు. మంగిని గుర్తుపట్టినట్లు లేదు. అది ఎవరో కూడ ఎరుగనట్లే యాతడు ప్రవర్తించెను. నగరములో, నామాల సీమాల ఇనుపపనిముట్లు చేయు పనివారు 'బాబా, బాబా, బాబా' యనుచు నాకస్మికముగా వచ్చి యాతని నెక్కడికో తీసికొనిపోయిరి.

అంతవరకును మేచయనాయకుడు తన భటులతో నా చుట్టుపట్టుల వీథులన్నియు నిరోధించి స్వయముగా నక్కడ కాపుండెను. ఆ భటు లందరును కనుబ్రామి మేచయనుగూడ కనుబ్రామి యా వచ్చిన మనుష్యు లాతని తప్పించుకొని తీసికొనిపోయిరి. మంగి తన కూతురు పాటితో నక్కడ మిగిలిపోయెను.

మేచయ కాశ్చర్య మయ్యెను. ఆతడు మంగిని పాటిని ఏమియు జేయదలపలేదు. భయముతో వడకిపోవుచున్న మంగికి ఇంటికి పోవుటకు మేచయ యనుజ్ఞ యిచ్చెను.

* * * * *

మరి యాత డెవరు? రంగనాథరామాయణము రచించుచున్న రంగనాథుడా? కానే కాదు! రంగనాథరామాయణకర్త రంగనాథు డైనచో నాతడు శివనింద చేయుట యసంభవము. ఆ రంగనాథుడు శివభక్తాగ్రేసరుడు!

మరి ఎవరీ శ్రీవైష్ణవుడు? అతడు శ్రీవైష్ణవుడే కాడు. అతడు ఇస్లాముమతప్రచారకుడు! చాతుర్వర్ణ్యజనములోనివాడు, కాడు!

అది తెలిసిన శ్రీవైష్ణవులలో గుసగుసలు ప్రారంభించెను.

"అయ్యో! ఇతడు నాకు తీర్థప్రసాదము లిచ్చెనే!"

"అయ్యో! ఇతడు నా సహపంక్తిని భుజించెనే!"

"ఎంత మోసపోతిమి!"

"మా పెరుమాళ్లు అపవిత్రు లైనారు. పులికాపు చేయవలెను!"

"ప్రాయశ్చిత్తము చేయించుకొనవలెను."



*

# ఎన్నికలకు అభ్యర్థులు

**శ్రీ వేలూరి సహజానందం**

**ఇం**కో ఏడాదిలోపల రాష్ట్రశాసనసభలకు, కేంద్రశాసనసభకు ఎన్నికలు జరుగుతయ్. ప్రజలకు, ముఖ్యంగా 100 కి 80 మంది చదువురాని ఓటర్లుగా ఉన్న మన ప్రజలకు, ఈ ఎన్నికలే ఉత్కృష్టమైన రాజకీయ, సాంఘిక ప్రబోధం. ఎన్నుకోవలసిన అభ్యర్థులు, ఆమోదించవలసిన పార్టీల కార్యక్రమాలు, ప్రణాళికలు క్షుణ్ణంగా పరిశీలించి, గ్రహించి, మళ్ళీ అయిదేళ్ళవరకూ తమ రాజకీయభవిష్యత్తును తాము నిర్ణయించుకొనే సదవకాశం. ఏపార్టీనిగాని, నాయకుడినిగాని, అభ్యర్థినిగాని, గుడ్డిగా 'నమ్మటం'గాని, 'ద్వేషించటం'గాని తగదు. 1946 ఎన్నికల్లో కాంగ్రెసు చీపురుపుల్లను నిలబెట్టితే ఆ చీపురుపుల్లకే ప్రజలు ఓట్లివ్వాలనే నినాదాలు విన్నాం. అలాగే చీపురుపుల్లలకూ ప్రజలు ఓటు ఇచ్చారు. దాని ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నారు. శాసనసభాసభ్యుల్లో అధికసంఖ్యాకులు ఎన్నికలయాక ఇళ్ళీ తమతమ నియోజకవరాలను చూసినపాపాన పోలేదు. కమ్యూనిస్టుదాడులు, పోలీసుదాడులు జరుగుతున్నా, ఈ సభ్యులుగాని, రాష్ట్రకాంగ్రెసు సంస్థప్రతినిధులు గాని ప్రజల అండన మంచాన్న పాపాన పోలేదు. రాబోయే ఎన్నికల సందర్భంలో ప్రజలకీ అనుభవం మంచి గుణపాఠం. ఇంకోసారి ఏపార్టీ అయినా చీపురుపుల్లలను నిలబెట్టి, ఓట్లివ్వమంటే, ప్రజలు ఆ పూనకంలో వివేకం పోగొట్టుకోక, ఆ చీపురుపుల్లలను ఒక కట్ట కట్టి రాజకీయరంగంలో ఓటముల పచేయగలరు. పచేయాలి.

పైకి చెప్పే దేశభక్తి, ప్రజాసేవ వీటికన్న నాయకుల చిత్తశుద్ధి నిష్కల్మషత, నీతినియమాలు ముఖ్యం అనే సంగతి ప్రజలు తెలుసుకున్నారు.

కాంగ్రెసంటే ప్రజల కేర్పడిన అసంతృప్తి నిర్లిప్తతగా గాని, అరాచకంగా గాని పరిణమించగూడదు. అసంతృప్తిలోంచి సక్రమమైన చైతన్యం, కార్యక్రమం ఏర్పడాలి. ఇందుకు ఎన్నికలు మంచి అవకాశం.

దేశంలో కాంగ్రెసుకు పోటీగా వ్యక్తులు పార్టీలు ఎన్నికల్లో పాల్గొంటారు. స్వాతంత్ర్యం తెచ్చిపూర్తిఅయిన కాంగ్రెసు నిప్పుడే దెబ్బతీయగలగటం ఏ పార్టీకీ సులభం కాదు. కాని ప్రజాస్వామ్యంలో ఏపార్టీకైనా ముఖ్యంగా మనిషిహంగు లేనిదే, పార్టీనాయకులు కొద్దిమంది అగ్రగణ్యులయినా, ఆపార్టీ వ్యాపించదు. వేళ్లు పోసుకోదు. 'డిక్టేటర్లు' దేశాలలో ఈ విధమైన మనిషిహంగు అవసరం లేదు. మిలిటరీ, పోలీసు, గూఢచారుల హంగుఉంటే చాలు. కాని ప్రజాస్వామ్యములో రాజకీయంగా తరిఫీదయిన ప్రతినిధులు, ఆర్థిక, సాంఘిక విషయాల్లో కొద్దో గొప్పో నేర్పుగలవారు తగినంతమంది ఉండటం అవసరం. శాసనసభాస్థానాలకు సరిపోయేంతమంది అభ్యర్థులను ఎంచుకోటానికైనా తగిన మనిషిహంగు ఉండాలి. అరవై ఏళ్ల కాంగ్రెస్‌పరిస్థితి చూస్తేనే, ఈ హంగు లేమివల్ల సంస్థ, 'దేశంకూడా' ఎంత దెబ్బతింటున్నదీ తెలుస్తుంది. ఇప్పుడున్న కేంద్ర, రాష్ట్ర నాయకులస్థానే నిలబడగలిగిన చిన్న నాయకులు బహు కొద్దిమంది. కాంగ్రెస్‌వారిలో కేంద్రఆర్థికమంత్రి పదవికి తగిన అభ్యర్థి లేకపోటం అతిశయోక్తి కాదు. సంఘర్షణకు తయారైనవారు పరిపాలనకుకూడా అర్హులు కాకటం కష్టం. దేశానికి సంబంధించిన ఆర్థిక, వ్యావసాయిక పారిశ్రామిక, కార్మిక, రైతు, కూలీ విషయాల్లో కాంగ్రెస్‌వారికి అధిక సంఖ్యాకులకు తగిన ప్రాజ్ఞత లేదనటం అతిశయోక్తి కాదు. అందుకనే కేంద్రశాసనసభలో గాని, రాష్ట్రశాసనసభలో గాని చేతులెత్తటమే తప్ప, సమస్యలను శాస్త్రీయంగా, స్పష్టంగా చర్చించటం మాదం. అక్కడక్కడ ఏ ఒకడో గొంతువిప్పుకుంటాడు. కాని మిగతావారి మౌనంలో అది అరణ్యరోదనం.

కాబట్టి ఏపార్టీ అయినా ఎన్నికల్లో నిలబడాలంటే, ముందు తగిన మనిషిహంగును చేకూర్చుకోవాలి. అగ్రనాయకులు పదిమంది ఉంటే చాలదు. సామాన్యప్రతినిధులకు సక్రమమైన శిక్షణ ఇచ్చి వారిని శాసనసభాసభ్యత్వానికి, అర్హులయేటుగా తర్ఫీదు చేయాలి.

చీపురుపుల్లలో, ధ్వజస్తంభాలో కాంగ్రెసుకు హంగు – సంఖ్యదృష్ట్యా – లోపం లేదు. కాని సంఖ్య విడిచి సమర్థత దృష్ట్యా చూస్తే కాంగ్రెస్ కున్న బలంకూడా తక్కువే. కొత్తపార్టీల సంగతి చెప్పనక్కర్లేదు. వీరికి సంఖ్య లేదు. సమర్థత కూడా అంతంతే అని చెప్పవచ్చు.

ఉదాహరణకు మన మద్రాసురాష్ట్ర శాసనసభలో ఈసారి 375 స్థానాలు ఉంటయ్. కాంగ్రెస్‌తో పోటీ చేసేవారు ఊరికే కాంగ్రెస్ 'బూర్జువా' సంస్థ, పెట్టుబడిదార్ల కీలుబొమ్మ అని హుంకరించినంతమాత్రాన కాంగ్రెస్‌స్థానాన్ని ఆక్రమించ



ఇరగవరం బోర్డుహైస్కూలు ప్రారంభోత్సవసందర్భమున తీయబడినఫోటో

కూర్చున్నవారు :- ఎడమనుంచి, ముదుగంటి జగన్న శాస్త్రి షేక్ హుస్సేని సాయబు నరసాపురం సబ్ కలెక్టరు చిదంబరం ఐ. ఏ. ఎస్. అధ్యక్షులు మాగంటి సీతారామదాస్ గారు, (ప్రారంభకులు జిల్లాబోర్డు అధ్యక్షులు) కొవ్వలి గోపాలరావుగారు.

లేరు. 375 స్థానాల్లో కనీసం 200, 250 స్థానాలకైనా పోటీఅభ్యర్థులను నిలబెట్టగల గాలి. అంటే 2½ కోట్ల ఓటర్లలో 250 మంది దొరకరా అనవచ్చు. సంఖ్యాదృష్ట్యా కాదు. సమర్థత దృష్ట్యా 250 మందిని, చివరకు 200 మందినైనా చేకూర్చుకోగలిగితే, ఎన్నికల ఫలితాలేమైనప్పటికి, విశేషమే. కాంగ్రెసుకు వ్యతిరేకంగా పోటీచేసేవారు స్వతంత్రఅభ్యర్థులు, హిందూ మహాసభ, సోషలిస్టుపార్టీ, చిల్లరమల్లర కులసంస్థలు. కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల్లో పాల్గొనే అవకాశం అట్టే గోచరించదు.* ఆ అవకాశాన్ని, అర్హతను వారే పోగొట్టుకున్నారు. బెంగాలు, పంజాబ్ రాష్ట్రాల్లో ఎలా ఉన్నా, ముఖ్యంగా మన రాష్ట్రాలలో మతసంస్థలు ఓట్లుపొందే అవకాశం లేదు. తమిళనాడు జిల్లాబోర్డు ఎన్నికలబట్టి, ఎక్కడైనా నూటికి కోటికి ఏదైనా కులసంస్థకు కొద్ది అవకాశం ఉండవచ్చు. ఇంక స్వతంత్ర అభ్యర్థులు. వీరికి అవకాశం ఉంది. ప్రజల భక్తివిశ్వాసాలు చూరగొన్న వ్యక్తులు పార్టీముద్ర లేనివారున్నారు. వీరు కిందటి మ్యునిసిపల్, జిల్లాబోర్డు ఎన్నికల్లో కొద్దిగా కాలు నిలదొక్కుకున్నారు. కాని వారికి ఒక నిశ్చితప్రణాళిక, కార్యక్రమం లేవు. వీరిలో ఎక్కువమంది కాంగ్రెస్‌వారే. తమ పూర్వసేవతో ప్రజల ఆమోదం పొందవచ్చు. కాని ఇందువల్ల ప్రజల కెక్కువ ఉపయోగం లేదు.

ఇంక సోషలిస్టుపార్టీ. మన రాష్ట్రంలో చిన్న పార్టీ ఇది. దీనికి తగిన మనిషిహంగు ఏర్పడటానికి ఇప్పటికన్నా ఇంకా ఎక్కువగా శ్రమపడాలి. ఆంధ్రదేశంలో శాసనసభకు 145 స్థానా లున్నాయ్. 145 మంది సమర్థులను ఎంచుకోటం సులభం కాదు, (కిందపట్టీలో వివరాలున్నాయ్.)

కాబట్టి మనకు ఎన్నికలరంగంలో కనబడేది కాంగ్రెస్‌పార్టీ, సోషలిస్టుపార్టీ, స్వతంత్రులు. ఎన్నికల ఫలితాల సంగతెలా ఉన్నా, ఆంధ్రదేశంలోని 145 స్థానాలకు 145 మంది సమర్థులను, కనీసం సగానికి సగం మందిని 70 మందినైనా సమర్థులను కాంగ్రెసుపార్టీ, సోషలిస్టుపార్టీ, స్వతంత్రులు నిలబెట్టగలగాలి. పార్టీలు ప్రజలు కూడా అభ్యర్థుల సమర్థతనే లెక్కలోకి తీసుకోవాలి.

* 1946 ఎన్నికల్లో 100 కి 10 మంది కమ్యూనిస్టుపార్టీకి ఓటిచ్చారు. పార్టీ ఇప్పటి తిరుగుబాటుకు పూనుకోకపోతే వచ్చే ఎన్నికల్లో ఇం కెక్కువ ఓట్లు వచ్చేవి.)

• ఆంధ్రదేశంలో శాసనసభాస్థానాలు

| జిల్లా | | మొత్తంస్థానాలు |
|---|---|---|
| విశాఖపట్టణం | — | 30 |
| తూ. గోదావరి | — | 16 |
| ప. గోదావరి | — | 11 |
| కృష్ణా | — | 12 |
| గుంటూరు | — | 18 |
| నెల్లూరు | — | 13 |
| కర్నూలు | — | 9 |
| కడప | — | 8 |
| అనంతపురం | — | 9 |
| బళ్లారి | — | 7 |
| చిత్తూరు | — | 12 |
| మొత్తం | | 145 |

కథానిక :



# నామకరణం

శ్రీ ధరణికోట శ్రీనివాసులు

పురిటిగది ప్రవేశించి ఆనాటికి పదిరోజు లైంది మా కనకం. అంతవరకు ఆమెను నేను చూడలేదు. ఇంట్లో పెద్దవాళ్లుండగా నేను చూడవలసిందేముంది? ఆనాడు ఆదివారం కావడంవల్ల యింట్లోనే వున్నాను. అమ్మగూడా అంది, 'దాన్ని ఓ సారి చూడగూడదురా' అని. సరే అనుకొని పురిటిగది ముందు కొచ్చి తొంగి చూచా.. యేవో మధురస్వప్నాలు కంటూ పసిపాపను తన గుండెకానగా ఒళ్లో పెట్టుకొని మహానందం అనుభవిస్తూవుంది. ప్రపంచాన్నంతా ఆగదిలోనే చూస్తూంది. తన బిడ్డనుగురించి యెన్నో తియ్యటి కలలు కంటోవుంది.

అమ్మాయి చక్కగా చదువుకుంటుంది. పెద్దదవుతుంది. వైభవంగా పెళ్లిఅవుతుంది. అత్తారింటికి వెళ్లుతుంది. యెన్నోవేడుకలు జరుగుతాయి. తనకు ఓ అల్లుడంటూ వస్తాడు యెన్నో పిండహ్యాకువరాలు అడుగుతుంటాడు. యివ్వలేక యింటివాళ్లు మాట్లుతారు. యేదోవిధంగా వాళ్లకుమట్టు చెప్పాలి అంటూ తను బిడ్డపక్షాన వాదిస్తుంది. "అబ్బా యెంతగోల తెచ్చిపెట్టింది. మా కనకం బిడ్డను కని! చల్లగా వున్న యింట్లో ఓ తుపాను పుట్టించిందే!......"

'కనకం' అంటూ పిల్చా. నావైపుచూచి చల్లగా నవ్వింది సిగ్గు అభినయిస్తూ, తను చెయ్యవలసిన పని అంతటితో పూర్తి అయినట్టుగా.

"ఆరోగ్యంగా వుందా శరీరం ? కనకం" అన్నాను నేను. ఉన్నానన్నట్టుగా తలవూపింది కనకం.

"పాపను చూస్తావట్రా! అంటూ అమ్మ గదివైపు వచ్చింది.

"యిప్పుడేం చూడడమమ్మా అసహ్యంగానూ, తర్వాత చూడొచ్చులే" అన్నాను.

"రంగు, రూపు తల్లిలాగే వుంటుందిరా. కాళ్లుమాత్రం మీ బామ్మలాగు దొడ్డికాళ్లు. ముక్కు సరిగ్గా నీదే!" అంటూ వర్ణన మొదలెట్టింది అమ్మ.

"అప్పుడే యెలాగు తెలుస్తుందమ్మా. పసికూన" అన్నాను నేను.

"తెలియకపోవడ మేమిటిరా. సరిగ్గా కనపడుతుంటేను. ఆ కనుబొమ్మలు చూశావా సరిగ్గా తాతవే - కళ్లుమాత్రం నావి", అని ఆవిడ మురిసిపోయింది.

"యేమిటో మీ ఆడవాళ్ల మాటలు. యింకా కళ్లైనా తెరువలేదు, అప్పుడే నీ కళ్లలాగే వున్నాయని యేలాగ కనుపించాయే!" అంటూ నాన్న వచ్చాడు గదివైపు.

"అట్లా మాట్లాడ్తారేం. పసికూనైతే మాత్రం ముక్కు మొహం పరిమితి తెలియదూ!...కోడలంటుంది వాళ్ల అమ్మమ్మ కళ్లలాగున్నాయని. ముక్కు మొహం సరిగ్గా వాళ్ల నాన్నలాగే వున్నాయని-కాని నేను బతికివుంటే చూస్తాను కళ్లుమాత్రం వాళ్ల అమ్మమ్మకళ్లు కావు. నేను ఆవిడను చూచానుకదూ. ఆవిడవి పిలకళ్లు. మామూలుగా కురచగా వుండేమనిషి. మన చంటిదెక్కడ. ఆవిడ యెక్కడ. కవుచిప్పల్లాగ కళ్లు, భారీ శరీరం నా అమ్మది. సరిగ్గా చేయెత్తుమనిషి అవుతుంది" అంటూ ముగించింది తన ధోరణిని అమ్మ.

"పిల్లలకు మహావస్తే తలిదండ్రుల పోలికలు వస్తాయేమో కాని అమ్మమ్మ పోలికలు తండ్రి, మేనమామతాతురు పోలికలు వస్తాయామ్మా నీ చాదస్తం కాకపోతే"అన్నాను నేను.

"రాకపోవడ మేమిటి రా - నీ వాలకం అంతా మాతాతదే. చెల్లాయిను చూచావా. సరిగ్గా మా అమ్మే - కళ్లుమాత్రం మా చెల్లెలివి. నడుస్తూవున్నప్పుడు వెనకనుంచి చూస్తే సాక్షాత్ మా అమ్మలాగే కనబడుతుంది. దాన్ని చూచినప్పుడల్లా అమ్మ జ్ఞాపకానికొస్తుంది". అంటూ కంట నీరొత్తుకుంది అమ్మ.

"నీ పుట్టింటివరస నీ పిల్లల కొచ్చినట్టు నీ కోడలుపిల్లలకు దాని పుట్టింటివరస రాకూడదేం" అన్నాడు నాన్న నవ్వుతూ.

(24-వ పేజీ చూడుడు)

# అపమానం

శ్రీ ఆకుండి నారాయణమూర్తి

కొత్తగా కాపరానికి వచ్చిన కోడలులక్ష్మికి ఆయింటి ఆచారవ్యవహారాలు సమంగా అవగాహనకాలేదు మొదట్లో! భర్త ఆఫీసుకు వెళ్లినతరువాత, ఆ ఇంట్లో తనకు తోడుగా మరోవ్యక్తి లేకపోడంచేత, అత్తగారితోనే కాలక్షేపం చెయ్యాకలసొచ్చేది లక్ష్మికి. తన పుట్టింటిలోమల్లే ఉంటుందని మొదట్లో అపోహపడిందామె!

"ఏమండీ అత్తగారూ! నీళ్లు బిందెలోకి తోడేసి పొయ్యిమీద పెట్టేసేనండీ" ఆ యింట్లో పనిచెయ్యడానికి ప్రారంభించి మొదటిరోజున అంది.

"ఆ బాల్చీ, బోర్లించేసేవా?"అంది అత్త "రుద్రాక్షమ్మ".

"అయ్యో! మరచిపోయానండీ ... బోర్లించి వచ్చేస్తా", అని నూతిదగ్గరకు పరుగెత్తింది లక్ష్మి.

నీళ్లు తోడేసిన తరువాత బాల్చీ బోర్లించవలసిన ఆవశ్యకతేమిటో ఆమె కర్థంకాలేదు. ఆయింటి ఆచారం అదికాబోలని లక్ష్మి అనుకుంది. తను అనవసరంగా ఓ తప్పుపని ప్రారంభంలోనే చేసినందుకు ఎంతో భయపడింది. ఇంకా అలాంటి తప్పుపనులను ఎన్ని చెయ్యవలసొస్తుందో అని ఆమె హృదయం ఆరాటపడింది.

"పొయ్యి రాజేసేదా?" అని బాల్చీ బోర్లించివచ్చి అడిగింది.

"జానకే!...మీయింట్లో ఇలాగే చేసుకుంటారేమిటి? మొదట స్నానంచేసి ఆ తరువాత రాజెయ్యి" అంది రుద్రాక్షమ్మ.

లక్ష్మి గుండెలు గుభేలుమన్నాయి. ఓ మిలటరీ కమేండరులా అగుపించింది రుద్రాక్షమ్మ. పొయ్యి రాజెయ్యడానికి ముందు స్నానం చెయ్యడం అనేది ఆయింటిఆచారం కాబోలని అర్థం చేసుకుంది. ఓ గావంచా కట్టుకొని స్నానం చేసింది. పెట్టిలో ఉన్న ఓ మడతచీరె తీసి కట్టుకుంది. "ఇంక రాజెయ్యనా?" అని అడిగింది.

"ఓసి నీతెలివి బొగ్గులవా...అదేమిటే, మడిగా స్నానంచేసి, మైల బట్ట కట్టుకున్నావ్!...నువ్వింక పొయ్యిరాజేసినట్లే, నేవంట చేసినట్లే! మీయింట్లో ఇలాగే నేమిటి చేసుకుంటారు" ఆశ్చర్యంతో అంది రుద్రాక్షమ్మ.

"అయ్యో, నాకంత బాగా తెలీదత్తగారూ!...అయితే మళ్లీ స్నానంచేసేదా?" అని అంది సగం భయంతో.

"ఊహుఁ...ఇవాళ్టికి నువ్వేమీ చెయ్యక్కర్లేదులే. మాటి మాటికీ స్నానంచేస్తే జబ్బుచేస్తుంది. నాలుగు రోజులపాటు నా దగ్గర తర్ఫీదుపొందేవంటే నాకన్నా ఆచారవంతురాల వవుతావు".

"నాలుగు రోజు లెందుకండీ! ... రెండు రోజుల్లో గ్రహించగలను".

"అదీ బుద్ధి మంతురాలి లక్షణం. అలా చెప్పే సమాధానాలు చురుకుగా, బాగా వుండాలి. చూడూ, పెద్ద కోడలుండే వట్టి మొద్దు! బెల్లం కొట్టిన రాయిలాంటిది. మూర్ఖత్వంకూడా కొంత ఉందిలే!"

"అయితే అత్తగారూ! ... అక్కయ్యగారూ, బావగారూ ఏ ఊళ్లో ఉంటున్నారండీ!"

"అబ్బ, ఆ ఊరుపేరేనాకు జ్ఞాపకం ఉండదే....ఏమిటిచెప్మా..."ఆయిదిగోమా" కాశీ వెళ్లేదారిలో ఉందిట.

"అంతదూరం ఎందుకు వెళ్లిపోయారండీ".

"ఏమిటో, వాడో పిచ్చిమనిషి...ఏదోనీ పెళ్లప్పుడు మీయింటికి రావడమే! అక్కణ్ణించి, ఇప్పటివరకూ రావడమే మానీసేడు ఆ వెధవూళ్లో ఏమి సౌఖ్యంగా ఉంటుందని అక్కడికి పోయేడు. ఒక మైలా అంటూ, అనేవిచక్షణ వుంటేగా వాడికి. ఇంతకీ దాన్నించే వాడలా తయారయేడు.

"ఆదేశాల్లో అందరూ అంతేనండి. మైల బట్టలతోనే భోంచేస్తారు."

"చూసేవా వెధవలు!...పాడవకేంచేస్తారు బ్రాహ్మణ్యాన్ని తగలపెట్టేస్తున్నారు. మరి లేకపోతే ఈకరువులూ, ఈయుద్ధాలూ ఎందుకొస్తున్నాయంటావు?"

"పెద్దల నియమాలను, నిష్ఠలను సమంగ పాటించలేదని."

"అదీ చిన్నదానివయినా నీకే బాగా తెలుసు" అంది రుద్రాక్షమ్మ.

ఇంతలో లక్ష్మి భర్త కామయ్య వచ్చేడక్కడికి. కాళ్లు కడుక్కోమని చెంబుతో నీళ్లు తెచ్చింది లక్ష్మి. కోడలు గ్రహింపుశక్తిని చూచి ఎంతో ముచ్చటపడింది రుద్రాక్షమ్మ.

"మా అమ్మ చెప్పిందా? ఇలా తెమ్మనమని" నవ్వుతూ అడిగేడు కామయ్య.

"లేదు. ఈయింటి ఆచారవ్యవహారాలను ఇప్పుడిప్పుడే అవగాహనచేసుకుంటున్నాను" అంది నవ్వుతూ.

"చూసేవురా అబ్బాయీ!...మీ వదిన లాంటి దనుకున్నావేమిటిది. చెప్పినపని చటుక్కున గ్రహించి చేస్తుంది" అంది తల్లి రుద్రాక్షమ్మ.

కామయ్య చిరునవ్వు నవ్వేడు. "ఏదో మొత్తానికి ఇదికూడా అత్తగారయే వేళకి నీకన్నా రెండాకులు హెచ్చు చదువుకొనేటట్లు చెయ్యి"అన్నాడు తల్లిని సంబోధిస్తూ.

"నాకోడలు నాఅంత దవుతే నాకంటే కన్నా ఏంకావాలి నాయనా! నాకు కూతురు లేనిలోపమే తీరిపోతుంది"

"ఓ! రేపొద్దున్న దీనికీ పిల్లలు పుడితే. రోజుకి నూరేసి మాట్లు స్నానం చేయించేస్తుంది మడీ! మడీ అంటూ."

"నీకూ పెద్దవాడి పోలికలు లేక పోలేదు." అంటూ వంటింటిలోకి వెళ్లిపోయింది రుద్రాక్షమ్మ.

"జానే లక్ష్మి!...ఇవాళ ఎన్నిమార్లు స్నానంచేసేవు?" అని అడిగేడు కామయ్య.

"ఇష్ఁ ... ఊరుకుందురూ. అత్తగారికి కోపంవస్తుంది." కనుబొమలు ముడుస్తు, అదోరకంగా నవ్వుతూ అంది లక్ష్మి.

"ఊహుఁ... చెప్పు. ఫరవాలేదులే."

"ఒక్కమారు—"

అంతట్లో "ఒరేయి నాయినా, ఆ పొయ్యి

గాడి నీళ్ళు పోసేసుకొని, ఓ చేదడు చన్నీళ్లో శుద్ధయి, మడికట్టుకొనిరా!" అని తల్లి పిలుపు వినబడింది వంటింట్లోంచి.

"వెళ్లండి" అంటూ గోడవారకు పోయి నవ్వడం మొదలుపెట్టింది లక్ష్మి.

"ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగేడు కామయ్య.

"చెప్పను."

"నాకు తెలుసునులే."

"చెప్పండి చూద్దాం?"

"నేను చెప్పను." ఇద్దరూ పకాలున నవ్వుతున్నారు.

"మా అమ్మ ఆచారం సరిం చే గా!" అన్నాడు కామయ్య.

"ఇష్.. భోజనానికి మడికట్టుకోండి." అంటూ పెరట్లోకి వెళ్లిపోయింది లక్ష్మి, నీళ్లు తోడిద్దామని.

*       *       *       *

మధ్యాహ్నం ఒంటిగంట అయేసరికల్లా ఇళ్ళు చక్కబెట్టుకొని ఆపీధి అమ్మలక్కలందరూ, రుద్రాక్షమ్మగారి గుమ్మంలో సమావేశమవడం అనుదిన కార్యక్రమాలలో ఒకటి!...విస్తరంటలు కుడుతూనో, లేక బొంతలు కుడుతూనో కూర్చుంటూ ఉంటే వారు. వాళ్ల సమావేశంలో చర్చించని విషయం అంటూ లేదు. భగవంతుని సృష్టిలో జరిగే యవిషయాలన్నీ వాళ్లవే అన్న భావంలో వుంటే వారు. ఆజట్టులోకల్లా నరసమ్మగారిది ప్రముఖస్థానం. ఎక్కడలేని విషయాలనూ సేకరించేదో విశేషరిలా ! ... తీవ్రమయిన తీర్మానాలను వాటిమీద పాస్ చేసేది. నరసమ్మగారంటే ఆపీధి అమ్మలక్కలందరికీ హడల్! . ఆమెకెదురు తిరిగి ఎవరయినా మాట్లాడేరా అంటే చచ్చినంత కలకానే రన్నమాటే.

ఒకరోజున ఏదో మాటలసందర్భంలో. . "రుద్రాక్షమ్మగారున్నారూ అంటే,...అవి టిది ఆచారం—అలా వుండాలి," అని, అంది నరసమ్మ.

"మాచేరగటండీ, వీళ్ల వీరకత్తెగారింట్లో, అంతా కాపకూడేనట!" అంది పొరిగింటి కామాక్షమ్మ.

"ఔనట!...బొత్తిగా ఆచారం లేదట!— మైలా, అంటూ, కాప, మాల అన్న భేదమే లేదట!— మాసి, చూసి అలాంటి సంబంధం చేసేరేమిటో!" అని నరసమ్మ ఓ ఘాటయిన రిమార్కు పాస్ చేసింది.

రుద్రాక్షమ్మ విని సహించలేకపోయింది. "వాళ్ల సంగతి మీఅందరికీ మహా తెలిసిపోయి నట్లు...వాళ్లకున్న ఆచారంలో సగమయినా మీరు పాటిస్తున్నారేమిటి? మాటలూరికే దండగ చేసేస్తారేం!" అంది రుద్రాక్షమ్మ.

"ఓహో—'అయ్యవారేం చేస్తున్నారూ అంటే చేసినతప్పుల్ని దిద్దుకొంటున్నారు' అన్నట్టుంది మీమాటల తీరు. తెలిసో, తెలియకో ఆసంబంధాన్ని చేసేరు పిల్ల బాగుంది కదా అని. పైవిషయములు చూడక అందుకిప్పుడుదాన్ని సమర్థిస్తున్నారు" అంది నరసమ్మ.

"ఊరుకోండి. ఎక్కడలేని విషయాలూ మీకే కావాలి. ఒకర్ని చులకనగా దూషించడమే కానీ మీవిషయమై మీరాలోచించుకోరు, గురివిందగింజ తన మచ్చ చూచుకోదట. అలా వుంది మీసంగతి" రుద్రాక్షమ్మ కొంచెం కోపంతో అంది.

"ఇది మరీ బాగుంది. మీకోడలు లక్ష్మి చెప్పింది, నాతో తనపుట్టింటారి సంగతినంతా. లేకపోతే నాకేం తెలుస్తుంది. "అబ్బ...ఏమిటండీ మాఅత్తగారిచాదస్తం... భరించలేం! ఎంతపుణ్యం ఆర్జించేద్దామనో ఆమె వుద్దేశం, ఇంకా పూర్వాచారాలమీద నమ్మకం పోలేదామెకు. మా యింట్లో మేం శుభ్రంగా కాపవానిచేతే నీళ్లు తెప్పించేసుకుంటాం. కూరలుంతరగడం, పచ్చళ్లు చెయ్యడం మొదలయిన పనులన్నీ మాకాపదానిచేతే చేయించేసుకుంటాం." అని మీకోడలే నాతో మొన్న అంది. లేకపోతే నాకేం తెలుస్తుంది" విస్తరంటలను, విసురుగా దొంతర పెడుతూ అంది నరసమ్మ.

"మాలక్ష్మి అలా అందంటే నేనన్నమ్మను. అది అలాంటి మనిషి కాదసలు. నేనంటే దానికెంతో అభిమానం! – చెప్పిన పనిని చటుక్కున చేసేస్తుంది. నన్ను ఓ తల్లిలా భావిస్తున్నాదది" అంది రుద్రాక్షమ్మ.

"ఔను. ఇప్పుడు మీతో అబద్దాలు చెప్పకపోతే నాకు కాలం గడవదని కాబోలు మీ అభిప్రాయం."

"కొందరి లాంటి లేనిపోని విషయాలను పుట్టిస్తూ ఉంటారులెండి!"

"ఇంతకీ. మీయింటి గుమ్మంలోకి వచ్చినందుకు ఇన్ని మాటలు పడవలసొచ్చింది. నిజమాడితే నిష్ఠూరం!...కావలిస్తే మీలక్ష్మినే అడగకూడదూ."

"ఒసేయి!...లక్ష్మి, – ఏంచేస్తున్నావు?– ఓమారిలా రా!" అని పిలచింది రుద్రాక్షమ్మ.

"ఏమండత్తా," అని సగం అల్లుతున్న లేసు గుడ్డతో పరుగెత్తుకొచ్చింది లక్ష్మి.

"ఔనే!—మొన్న నువ్వు మీ పుట్టింటి గురించి, మీ అత్తగారి ఆచారంగురించీ నాతో ఏమని చెప్పేవే?" అని అడిగింది నరసమ్మ.



అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని గురించిన ఒకానొక భావోత్తేజకమైన పోస్టరు చిత్రాన్ని పరిశీలనగా పరికిస్తున్న ఆహారవ్యవసాయమంత్రి శ్రీ. యం. మున్షీ గారు.

లక్ష్మిగుండెల్లో రాయిపడింది. నరసమ్మ ఇంత పేచీకోరుమనిషని అనుకోలేదామె. ఏదో మంచిమనిషనుకొనే, తన స్వవిషయం గురించి, అత్తగారి ఆచారవ్యవహారాలగురించి నరసమ్మతో ముచ్చటించిన మాట నిజం. కానీ నిజం చెప్పితే అత్తగారేమనుకుంటారో అసత్యం చెప్పితే ఏమి ముప్పు వాటిల్లుతుందో ఇంతకీ తను నరసమ్మతో అన్నమాటల్లో తప్పేముంది?...తన పుట్టింటివారింటిలో "ఆచారం" అనేపదానికి తావులేదన్న సంగతి అత్తగారికి బాగానే తెలుసు. అంచేత ఆమాట ఎవరితో చెప్పినా తప్పేం? ఇంక తన అత్తగారు ఆచారవంతురాలని ఎవరితో అన్నా తప్పేం? అందులో అబద్ధముందా? ఈ రెండు విషయాల గురించేకదా, నరసమ్మతో తను ముచ్చటించింది. లక్ష్మిఆలోచనలు పరిపరివిధాల పోయేయి.

"ఏమన్నావు. చెప్పు?"అని అత్తగారంది తను ఆ విషయాలేమీ నరసమ్మతో అనలేదని కోడలు చెపుతుందని రుద్రాక్షమ్మ ఆశ. ఎలానయినా నలుగురి మధ్యా తన మాట నెగ్గించుకొందామని రుద్రాక్షమ్మ కోరిక!_ కోడలు నిజంగా నరసమ్మతో ఆవిషయాలన్నీ అన్నప్పటికీ 'అనలేదు' అనే అబద్ధంచెప్పేస్తే బాగుండునని అనుకుంది. రుద్రాక్షమ్మ. నలుగురి మధ్యా నరసమ్మ వట్టి పేచీకోరు. అని ఋజువుచేద్దామని రుద్రాక్షమ్మ కోరిక! అంతే!...కోడలి పుట్టింటివారి ఆచారవ్యవహారాలు ఎలాగుంటాయో ఆమెకు బాగా తెలుసు. కోడలు ఆమాటలు అనడంగూడా సమంజసమే!_అందువల్ల తప్పు లేదనికూడా సమర్థించుకుంది. కాని ఆ క్షణంలో మట్టుకు అబద్ధం ఆడితేనే!...

కానీ, రుద్రాక్షమ్మ అనుకున్నట్లు మాత్రం జరగలేదు. నరసమ్మ చెప్పినట్లు తను అన్నానని ఒప్పేసుకుంది లక్ష్మి.

'ఇప్పటికి బోధపడిందా?' అంటూ విస్తరంటులు పట్టుకొని గబగబా నడక సాగించింది నరసమ్మ.

* * * *

లక్ష్మి కాపరంలో తుపాను చెలరేగింది. కోడలు తన్ని అందరి మధ్యా అవమానపరచిందని రుద్రాక్షమ్మ ఆగ్రహం!...ఏదో వంక పెట్టి కోడలిని తిట్టనిరోజంటూ లేదు. కొడుకు ఆఫీసునుంచి ఇంటికి వచ్చేసరికి ప్రతిరోజూ ఏదో ఓ రిపోర్టు కోడలిమీద జారీ చేస్తూవుండేది. అటుచూస్తే తల్లి, ఇటు చూస్తే అమాయకురాలయిన భార్య!... వీళ్లలో ఎవరిని ఏమనగలడు. అనవసరంగా రేగిన ఈ వ్యర్థకలహాలనుంచి కామయ్య మనస్సు పూర్తిగా పాడయింది. ఎటూచెప్పి భార్యనుమట్టుకు మందలిస్తూ ఉండేవారు. "ఔనుగానీ, మా అమ్మఆచారవిషయమై, ఆ నరసమ్మతో ఎందుకు చెప్పేవు? అది వట్టి పేచీకోరుమనిషి కదా." అన్నాడు కామయ్య.

'తప్పుపనే చేసేనని ఇప్పుడు గ్రహించాను. కానీ అనవసరంగా అత్తగారికి నామీద కోపం వచ్చేసింది". అందిలక్ష్మి.

"ఔను. ఆ పరిస్థితిలో ఎవరికయినాసరే కోపం రావడం సహజం. సరే!_అమ్మ ఏమయినా నిన్ను అన్నప్పటికీ, అనవసరపు జవాబులు చెప్పక, నీమానాన నువ్వు నీపని చూసుకుంటూ ఉండు."

"అలాగే"

"అన్నట్టు చెప్పడం మరిచా_ మా అన్నయ్య వదినా ఇవాళ సాయంకాలం రైల్లో వస్తారట! రైలుదగ్గరకు రావలసిందని ఉత్తరం వచ్చింది.'

"నిజం!...అత్తగారితో చెప్తా'' అంటూ నట్టింటిలోకి పరుగెత్తికది లక్ష్మి. ఆ తొందరలో గుమ్మందగ్గర వున్న పాలగిన్నె నుతన్నేసింది.

"అయ్యో, తన్నేసేవూ? ఎందుకా మిడిసిపాటు?_శనిదేవతవు. ఎలా అయితేనేం దాపరించే వీ కొంపకి' అంటూ తిట్టడం మొదలు పెట్టింది. రుద్రాక్షమ్మ.

"చూసుకోలేదండీ!... ఇవాళ సాయంకాలం రైల్లో అక్కయ్యగారూ, బావగారూ వస్తారట!...ఆ విషయం చెపుదామని వస్తూ తొందరలో...''

"ఏం?...కళ్లు లేవేమిటి?...ఇంక వాళ్ల మీద మహా అభిమానం కొర్లుకొచ్చినట్లు. ఏదోరకంగా ఇల్లు గుల్లచేసి వెళ్ళు మహాతల్లీ! నువ్వేం తక్కువదానివా? తేనిపూసిన కత్తి.''

లక్ష్మి బిక్కచచ్చిపోయింది. మరేమాటా అనలేదు. గోడవారకు పోయి తల వంచుకొని నిలబడింది. కళ్లలో నీరు గిరగిర్రా తిరిగింది. కానీ ఏడవడానికి సాహసం లేకపోయింది.

"నీకు చాకిరీ చెయ్యడానికి నే నున్నాను కదూ? అదేనా నీధైర్యం ఏళ్లొచ్చేయేళ్లదాన్నయినా నా కింకా సుఖం లేదు. ఇదంయ నా కర్మ" గొణగడం మొదలు పెట్టింది రుద్రాక్షమ్మ.

నూతిదగ్గరకు గబగబా వెళ్లింది లక్ష్మి స్నానంచేసి వంట ప్రారంభిద్దామని. మళ్లీ అత్తగారి గొంతు వినిపించింది. "హాయిగా ఆ పెద్దకోడలే తెలివి. ఆచారం లేదన్న మాటే గానీ, దీనిలాంటి కుళ్ళుబుద్ధు లేమీ లేవు ఎప్పటికయినా అదే నాకు చేసిపెట్టేది. అని.

చేదడునీళ్ళు పైన పోసుకుంది లక్ష్మి అంతవరకూ ఆపుకున్న కళ్లనీళ్లు ఆ నీళ్లతో కలసిపోయాయి.

"ఎంతసేపలా నీళ్ళు పోసుకుంటావు? మళ్లీ అత్తగారిగొంతు.

"అయిపోవచ్చింది, వచ్చేస్తున్నా. తొందరలో రావడంవల్ల నట్టింటిలో గో వారనన్న పట్టెమంచం తగిలింది.

"అయ్యో, నీమడి తగలడ!...ఏం పోగే కాలమే యిది. ఇవాళ మరి మమ్మల్ని అన్నం తిననివ్వ వేమిటి? పిశాచలాం పీక్కుతింటున్నా వేమిటే?"

మరేం మాట్లాడలేదు లక్ష్మి. మళ్లీ నూతి దగ్గరకు పరుగెత్తింది. మళ్లీ స్నానంచేసింది ఆరోజున ఎలానో వంట చేసింది.

* * * *

ఆ సాయంకాలం రైల్లో తోటికోడలూ బావగారూ వచ్చారు. తనకు సహాయకారిగా తోటికోడలు ఉంటుందని లక్ష్మి మొదట్లో ఆశపడింది. కానీ తను అనుకున్నట్లు జరగ లేదు. ఆచారం మానేసి తనలాగే మసలమని లక్ష్మికి హితోపదేశం చేసింది తోటికోడల కమల. అందుకు ఒప్పుకోలేదు లక్ష్మి. తన చెప్పినట్లు వినలేదనే ద్వేషంచేత, లక్ష్మిమీద కక్షగట్టింది కమల. అగ్నిదేవుడికి వాయుదేవుడు సహాయపడ్డట్లు, లక్ష్మిని బాధలపెట్టడంలో రుద్రాక్షమ్మ, పెద్దకోడలూ ఏకమయేరు.

రోజులు గడుస్తున్నాయి!...రోజులతో పాటు లక్ష్మిజీవితంలో విషాదరేఖలు వెల్లివిరిసిపోతున్నాయి!_ ఆ ఇంట్లో ఉండడం ఓ నరకంలో ఉన్నట్లనిపించేది లక్ష్మికి మానసికంగా లక్ష్మి ఎంతో బాధపడుతున్నాదన్న సంగతి కామయ్యకు తెలుసు. "మీ పుట్టింటికి కొన్నాళ్లు వెళ్లి అక్కడ ఉండకూడదూ?" అన్నాడు కామయ్య లక్ష్మితో.

"అలాగే, ఆలోచించి చెప్తా." అంది లక్ష్మి.

కాని, ఆ విషయమై ఆట్టే ఆలోచించవలసిన ఆవశ్యకత తప్పిపోయింది లక్ష్మికి. కొన్నాళ్లపాటు, 'గోమో' వచ్చి తనదగ్గర ఉండమని తల్లిని కోరేడు పెద్దకొడుకు.

(35 వ పేజీ చూడుడు)



భీమేశ్వరస్వామి వారి సరోవరం



దాక్షారా



దేవాలయపు సింహద్వార గోపురం



దేవాలయపు వెనక తట్టు గోపుర



మ భీమేశ్వరస్వామి మూలవిరాట్



# దా
# క్షా
# రా
# మ



భీమేశ్వర స్వామి దేవాలయం

# ★ భీమేశ్వర క్షేత్రం ★





భీమేశ్వరాలయంలోని రాతిస్తంభాల మంటపం

# హాలీవుడ్ పంచ వన్నెల చిత్రం



చంద్రగోళదృశ్యం: చంద్రగోళంమీదికి దిగిన ఖగోళ శాస్త్రజ్ఞులు. చంద్రగోళంమీదినుంచి భూమిదృశ్యం.

హాలీవుడ్ ఫిలిం నిర్మాతలు టెక్నికలర్‌లో, "చంద్రగోళప్రయాణం" అనే పేర ఒక విచిత్రమైన ఊహాచిత్రాన్ని తయారు చేస్తున్నారు.

రాకెట్ విమానంలో బయలుదేరి చంద్రగోళానికి యెగిరి పోతుంటే ఎలా వుంటుందో ఊహించి, ఈ ఫిలింలో చూపుతున్నారు. కథలో చాలా భాగం, భూమ్యాకర్షణశక్తియొక్క అవధులు దాటిపోయిన అవకాశంలో జరిగినట్టు తీస్తారు. కథలోని వ్యక్తులు గాలిలో తేలిపోతున్నట్టూ, రాకెట్ విమానంప్రక్క గోడలమీదా, పైటాపుమీదా తలక్రిందుగా నడిచిపోతున్నట్టూ ఫిలింలో చూపుతారు.

ఈ చిత్రాన్ని తయారుచేయటంలో సాంకేతికవిద్యాప్రవీణులు తమ తెలివితేటలన్నీ ఉపయోగించుతున్నారు. ఈ చిత్రం షూటింగ్ చేసేటప్పుడు "సెట్టూ," కెమెరాలూ కూడా యిష్టం వచ్చినట్టు ఎటుబడితే




చంద్రగోళంమీద దిగిన రాకెట్ విమానం.

# 'చంద్రగోళ ప్రయాణం'




భూమ్యాకర్షణావధికి మించిన అవకాశంలో ఆక్సిజన్ టాంకు సహాయంతో విహారం.




ఆకాశవిహారరంగానికి రిహార్సలు

అటు తిరిగిపోవటానికి గల యేర్పాట్లు చేశారు. ఈ విధంగా రాకెట్ విమానం యొక్క అడుగుభాగం పైభాగంగానూ, పైభాగం అడుగుభాగంగానూ మారిపోయే సావకాశం కల్పించి భూమ్యాకర్షణావధి దాటిన అవకాశంయొక్క భ్రమను కలుగ చేస్తున్నారు.

మనుషులు, గాలిలో తేలిపోయినట్లు చూపటానికి తీగలు ఉపయోగించుతున్నారు. కాని తెరమీద వాటిని కనిపించకుండా చేస్తారు.

ఇది కేవలం ఊహావిషయమే. కాని శాస్త్ర విజ్ఞానవేత్తలు. రాకెట్ విమానంద్వారా చంద్రగ్రహం దగ్గిరికి యెగిరే సావకాశాలను గురించి ఏ రకంగా ఊహించుతున్నారో ఈ చిత్రం నిరూపిస్తుంది. చాలా రంగాలను ఖగోళ శాస్త్రజ్ఞుల సహాయంతో తయారుచేస్తున్నారు. తక్కిన రంగాలను, కాలిఫోర్నియా పశ్చిమతీరంలోని మౌంట్ విల్సన్ ఖగోళ పరిశోధనాకేంద్రంలోని ఛాయా-చిత్రాల ఆధారంతో తయారుచేస్తున్నారు.

# పంచాయతీ ప్రభలు

కాలకంఠుని నాగసర్పము
బుసబుసమూడ్చి పడగబుస్సంది
రెండు నాల్కలు గండు మీసా
లట్లు దూసింది; చెవులు మోసింది ;
నాగసార మూదేది యెవరోయి
రాగ మెలికించేది యెవరోయి ?

అన్నారు కవికొండలవారు శివరాత్రి ప్రభలో.

దేశమంతటా వెలశాయి ప్రభలు, బుస బుసలు, కాంగ్రెస్ పంచాయతీ ప్రభలు.

వీరలంతా ఆవేశంతో రెండేసి నాల్కలు వెయ్యేసి నాల్కలు చిరపరా, నిప్పుశిఖల్లాగా (గండుమీసాలకిందనుంచి కొందరు పెడిమూతులతో కొందరు) దూశారు. నాగస్వరం పట్టారు. లౌడ్ స్పీకర్లు పట్టారు. గదుల్లో దూరి గుసగుసలాడారు. బుసలు కొట్టారు.

క్రోధ, భీభత్స, రౌద్రరసాలు ఒలికించారు. వరదలు కట్టించారు.

మైరావణుని రక్తం చిందిన ప్రతిచుక్కనుంచీ వందలాది మైరావణు లుద్భవించి నేలను ఈనివేశారు. ఎన్నికల ప్రభలతో జాబితాల కట్టల్లో ఫిర్యాదుల్లో, కర్రల్లో, ఖద్దరుకండువాల్లో కాంగ్రెస్ వీరులు వేలుగా లక్షలుగా తెలుగు నాట పిలపిలా బయలుదేరారు. కాంగ్రెస్ ఢక్కలు మ్రోగించి తాండవం చేశారు.

సంకల్పమాత్రంతో లక్షలాది కాంగ్రెస్ సభ్యుల్ని సృష్టించారు. జాబితాలు చేతబట్టి వీరాంగానికి పూనుకున్నారు. ఆశ్రితజనులకు అభయమిచ్చారు. పరుల జాబితాలను తిరస్కరించారు. లయకారుడు, లోకతస్కరుడు రౌద్రమూర్తి.

సామదాన భేద దండోపాయాలు ప్రయోగించి రిటర్నింగ్ ఆఫీసర్లని సాధించారు. హిరణ్యదానం జరిపించారు. బ్రహ్మని తిమ్మిని, తిమ్మిని బ్రహ్మిని చేశారు. వారితో పాటు వీరు, వీరితోపాటు వారు, పరదేవతలను శరణుజొచ్చారు. వాయుసందేశాలు, తీగసరిదేశాలు బిలబిలా పరదైవతాలకు చేరాయి.

ముందుగా పిల్ల దేవత లొచ్చారు. వారికి విన్నపా లర్పించుకున్నారు. బ్రతిమలాడారు. అనునయించారు. చేయెత్తి బెదిరించారు. ఢక్క మ్రోగించారు. కర్ర ఝుళిపించారు. కాళ్ళపై నపడ్డారు. సాష్టాంగదండప్రణామం చేశారు. నివాళి యిచ్చారు. తిరిగి పరదేవతలకు మ్రొక్కారు. ఈ మారు దుంగ కాదు కొంగ వచ్చింది. కొంగవచ్చి చీలిన నాల్కల్ని చించి చెండాడింది. అమృతం పంచడానికి మోహినీదేవత వచ్చిందనుకున్నారు. కాని తీరా వచ్చినది తుని తగవు తీర్చే పెద్దమనిషి. దానితో వారి కళ మాసిపోయింది. వీరి రంగు తగ్గిపోయింది.

త్రిమూర్తుల్లో ఒకరి అనుచరవర్గం కర్పూరం వలె హారించిపోయింది – ఏ గుప్పెడో మినహా. ఇంక ఇద్దరు మూర్తుల ఉజ్జీలా ఊరూరా, తాలూకాలు, జిల్లాలు మండలాలు పంచుకుంటున్నారు. అంటే కొత్త రాష్ట్రకాంగ్రెస్‌లో, కొత్త ఎన్నికల అభ్యర్థుల నియామకసంఘంలో, కొత్త శాసనసభలో ఉజ్జీల చెడుగుళ్లు యథాతథం.

[ఎస్సార్]



లండనులో థేమ్సునదిమీద కొత్తవంతెన ఇప్పుడే ప్రారంభమైంది. పూర్తియైన మీదట ఇది 600 టన్నులు తూగుతుందట. 1500 అడుగుల పొడవుంటుందట.



## బాలానందం

# గాంధీజీ, ఆండ్రూస్

**శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం**

మృదుత్వము, కాఠిన్యముల అపూర్వసమ్మేళనం గాంధీమహాత్ముడు. ఆయనమనస్సు ఒక్కొక్కప్పుడు గులాబిరేకకంటె ఎంతో సున్నితంగాను, మృదువుగాను ఉంటుంది. ఒక్కొక్కవేళ అది వజ్రంకంటె కఠినంగా ఉంటుంది. ఆండ్రూస్‌స్వభావం అట్టిది కాదు. దానికి కేవలం విరుద్ధమైనది.

1926వ సంవత్సరంలో ఆండ్రూస్ బాపూజీసన్నిధానంలో విశ్రాంతి తీసుకొంటున్నాడు. ఆసమయంలో దక్షిణభారతదేశం నుండి ఒక కాంగ్రెసుసేవకుడు సబర్మతి వచ్చాడు.

అతడు యువకుడు; ఒక అనివార్యమైన చిక్కున బడి వచ్చాడు. అతడు ఒక జిల్లాకాంగ్రెసుసంఘ కార్యదర్శి. కాంగ్రెసునిధి పెద్ద మొత్తం అతని చేతికి వచ్చింది. దాన్నతడు, అవసరమైన ఆయా పనులకు వెచ్చించాడు. కాని చిన్న లోపం ఒకటి వచ్చింది. అతడు సరియైన జమాఖర్చులు వ్రాయలేదు. తాను పుచ్చుకొన్న డబ్బుకు రసీదు లివ్వలేదు; తాను ఖర్చు చేసిన డబ్బుకు రసీదులు పుచ్చుకోలేదు. కార్యవర్గసభ్యులు అతడ్ని లెక్కలు చూపమన్నారు. సరియైన జమ, ఖర్చు, అతడు చూపలేకపోయినాడు.

ఒక వెయ్యిరూపాయల లోటు వచ్చింది. కార్యవర్గం ఆ ధనాన్ని అతడు చెల్లించాలని తీర్మానించింది. అతడు చాల ఆశ్చర్యపడ్డాడు. ఆ ధనంలోనుండి తాను స్వార్థానికై ఒక చిల్లిగవ్వకూడ వెచ్చించలేదు. కాంగ్రెసు కార్యకరామతులకే తానాడబ్బు వెచ్చించాడు. అతని నిజాయితీని ఎవ్వరు శంకించరు. అతడు సరిగా జమ, లెక్కలు వ్రాయకపోవటం తన దోషమే అని అంగీకరించాడు. కాని కార్యవర్గం తన్ను కఠినంగా డబ్బు చెల్లించమనటం అన్యాయమని భావించాడు. తాను జీతం పుచ్చుకొని పని చేస్తున్న నౌకరు కాడు. ఉన్నతపాఠశాలలో శాశ్వతమైన ఉపాధ్యాయవృత్తిని విరమించి, స్వాతంత్ర్యసమరయోధుడై, ప్రజాహితైకజీవనం కోసం కాంగ్రెసుసేవ చేస్తున్నాడు.

ఈ కష్టసమయంలో అతడు బాపూజీని స్మరించాడు. ఆయన సన్నిధి కేగి, విన్నవించుకొని తన్ని ఆపదనుండి రక్షింపమని ప్రార్థేయపడదామని భావించాడా కార్యదర్శి. వెంటనే ప్రయాణమై సబర్మతి ఆశ్రమం చేరుకొన్నాడు.

బాపూజీతో తన విషాదగాథ నంతా అతడు విపులీకరించాడు. బాపూజీ మిక్కిలి సానుభూతితో విన్నాడు. ప్రక్కనే ఆండ్రూస్ ఉన్నాడు. విషయాన్ని సమగ్రంగా తెలుసుకోటానికి బాపూజీ అనేక ప్రశ్నలు వేశాడు. కార్యదర్శి నిజాయతీ కలవాడని ఆయన గ్రహించాడు. అతనిలో స్వార్థబుద్ధి కాగడా వేసి వెతకినా కనిపించలేదు. కాని సరియైన లెక్క వ్రాయనందు కతడు నేరస్థుడు.

"ఈవిషయంలో నన్నేమి చేయమంటావు?" అని గాంధీజీ ప్రశ్నించారు.

తన జిల్లా కాంగ్రెసుసంఘానికి బాపూజీ ఒక లేఖ వ్రాసి, తన తప్పును క్షమింపజేయాలని కార్యదర్శిఆశయం. అతడు తన ఆశయాన్ని అవ్యక్తభాషలో దీనంగా వ్యక్తపరచాడు. ఆండ్రూస్ సానుభూతిపూర్వకమైన దృష్టులు ప్రసారించాడు. కాని బాపూజీదృక్కులు నిర్దాక్షిణ్యమైనాయి.

"నే నెన్నడు అట్టి జాబులు వ్రాయను. నీ ప్రవర్తన క్షంతవ్యము కాదు. ప్రజానిధిలోని ప్రతి కాసు పవిత్రమైనది. దాని విషయంలో నీ వెంతో అప్రమత్తతతో ఉండాలి. సరిగా లెక్క వ్రాయని ప్రతిదమ్మిడీ దుర్వినియోగం చేసినట్లే. ప్రజాసేవకునకు సరిగా లెక్క వ్రాయటం, అతని ప్రవర్తనలో అంతర్లీనం కావాలి. ఇప్పటికైనా

ఆ లెక్కలు సరిచూడు. లేదా! కార్యవర్గానికి ఆ మొత్తం వసూలు చేసే అధికారం ఉంది. అవసరమైతే నీ ఆస్తిపాస్తు లమ్ముకొనైనా ప్రజాఋణం నుండి విముక్తుడవు కమ్ము" అన్నాడు బాపూజీ జలద గంభీరస్వరంతో నిర్దాక్షిణ్యంగా!

అశనిపాతంలాంటి బాపూజీ వాక్కులు కార్యదర్శిని కల్లోలిత మొనర్చినాయి. మహాత్ముని నుండి తా నాశించింది యిట్టి సానుభూతి కాదు. మహాత్ముడు దయాదాక్షిణ్యాల సాగరమని భావించాడు. తన హృదయగతవిషాదాన్ని అణచుకో లేకపోయాడు, ఒక్కపెట్టున పసిపిల్లవాడిలాగా ఏడిచాడు పాపం కార్యదర్శి!!

ఇదంతా తిలకిస్తూ ఆంద్రూస్ చకితుడైనాడు. కార్యదర్శికన్నీరు ఆయనసున్నితమైన హృదయాన్ని ద్రవీభూత మొనర్చింది. పశ్చాత్తప్తుడైన యువకుని విషయంలో ఇంత నిర్దాక్షిణ్యం తగదని బాపూజీకి చల్లగా తెలియజేశాడు ఆంద్రూస్.

"అవును. అతడు పశ్చాత్తాపం చెందటం ఎంతో సమంజసం. పశ్చాత్తాపం మాటలతో కాదు. క్రియారూపంగా చూపించాలి. తాను చేసిన తప్పు దిద్దుకోవాలి. కాంగ్రెస్ పరువుప్రతిష్ఠలు, అతని మీద, అతనివంటి ప్రతి కాంగ్రెసుసేవకుని మీద ఆధారపడి వున్నాయి. అతడు వెంటనే తన జిల్లా చేరుకొని ఏదో విధంగా ప్రజామూల్యాన్ని చెల్లించి, తరువాత నాదగ్గరకు వస్తే సంతోషిస్తాను" అన్నాడు గాంధీజీ అనునయపూర్వకంగా.

ఇప్పు డింకొక చిక్కు వచ్చింది. ఆయువకునకు తిరిగి యిల్లు చేరుకోటానికి రైలుఖర్చుకుకూడా డబ్బు లేదు. అందుకై అతనికి కనీసం ముప్పదియైదు రూపాయలన్నా కావాలి. మహాత్ముడ్ని అర్థించాడు; దానినైనా ప్రసాదింపమని.

ఆంద్రూస్‌హృదయం మరీ పల్చబడింది. "బాపూ! ఆడబ్బు నిద్దాం పాపం! అతడు త్వరగా తన దేశం పోయి ఋణవిముక్తికి ప్రయత్నిస్తాడు" అన్నాడు ఆంద్రూస్ దాక్షిణ్యపూర్వకంగా.

"వీలు లేదు. ముప్పదిఅయిదు రూపాయలు నీవు, నేను, ఎక్కడ నుండి తేగలం? మనం దరిద్రనారాయణులంగదా! అతనిచెంత డబ్బు లేకపోతే, అతడు మజిలీలప్రకారం నడచిపోవలసిందే. అత డిప్పటికే ఎంతో ఋణపడ్డాడు. దానికింకా ఈమొత్తాన్ని కలపటంకూడానా?" అని ఖండించాడు బాపూ, ఆంద్రూస్ అభిప్రాయాన్ని.

ఆంద్రూస్‌మనసు కష్టభారమైంది. ఇక్కడ గాంధీజీతో ఆయన పూర్తిగా భేదించాడు. ఆయువకుని విషయంలో అంత దాక్షిణ్యరహితంగా వర్తించటం తగదని బాపూజీతో అన్నాడు. కాని ఆయన రవ్వంతకూడా మారలేదు. కార్యదర్శి భోజనానంతరం ఆశ్రమం వదలి నిరాశతో వెళ్లబోతుండగా గాంధీజీ అత న్నిలా ఆశీర్వదించాడు. "ఇంటికి పో! నాసలహా ప్రకారం కావించి జాబు వ్రాయి. నీకు దేవుడు మేలుచేయునుగాక! ; నీజాబుకై ఎదురుచూస్తాను!"

ఆంద్రూస్ ఆ యువకునితో సబర్మతీస్టేషనువరకు నడచివెళ్లాడు. స్టేషన్‌వద్ద ఆంద్రూస్, తాను స్నేహితునివద్దనుండి బదులు తెప్పించిన డబ్బు తీసి, యువకున కిచ్చి పని విన్నాడు.

ఆంద్రూస్ ఆశ్రమానికి వెళ్లి, చిరునవ్వుతో "బాపూ! నే నో తప్పు చేశాను" అన్నాడు.

"అవును! నాకు తెలుసు!" అని బాపూజీ నవ్వుతూ, "నీ వా యువకునకు రైలుఖర్చు లిచ్చివుంటావు. నా కామాత్రం తెలియదూ? నీ వెప్పు డీలాంటి



ప్రొద్దుటూరులో ది 27-7-50 తేదీ ఉదయం 8 గంటలకు జన్మించిన విచిత్రమైన ఆవుదూడ. రెండు మొండెములు నడుమువద్ద అతుక్కొని వున్నయ్; రెండు తలలూ, రెండు తోకలు మూడుజతలకాళ్లూ వున్నయ్.

బాలానందం :

# స్వర్ణయోగము

శ్రీ బి. వి. కృష్ణ

పూర్వకాలమున కాంచీపురమున సుదర్శనుడను మహారాజు పరిపాలించుచుండెను. అతనివద్ద బుద్ధిసాగరుడను మంత్రి యుండెను. మంత్రి సకలశాస్త్రములందును మిక్కిలి ప్రజ్ఞ కలిగి మహామేధావి యని కీర్తి బడసెను సుదర్శనుడు విద్యావంతుడైననూ అమాయకుడు. అతడెవరుచెప్పిన యది నిజమని నమ్మువాడు. కావున పెక్కుమంది టక్కరులు తమవద్ద ఏదో పెద్ద ప్రజ్ఞ ఉన్నదని పల్కుచు మంత్రికి తెలియకుండ రాజుయొద్దనుండి ధనము సంగ్రహించుచుందురు.

ఇట్లుండగా కాంచీపురమునకొక యతీశ్వరుడు వచ్చెను. అతడు చూచుటకు మిక్కిలి తపశ్శక్తి కలవాడుగను, మంచి మహిమ కలవాడుగను గన్పట్టుచుండెను. అతడు కొంతమంది శిష్యులతో కాంచీపురమునందలి దేవాలయములో బస చేసియుండెను. ఇది చూచి యా పురప్రజ లాతనిని దేవాంశ సంభూతునిగా దలంచి యతనిని సేవించుచు పండ్లు, పాలు, మొదలగునవి యొసగి యతనివద్దనుండి విభూతిని పుచ్చుకొనుచుండిరి. అతని శిష్యులు సేవింపవచ్చిన ప్రజలకు తమ గురువు ప్రజ్ఞ గలవాడనియు స్వర్ణయోగము బాగుగా దెలియుననియు దెల్పుచుండిరి. ఇది విని ప్రజలందరు నతనిని సామాన్యుడు గాడని భావించి యింకనూ అధిక శ్రద్ధతో పూజింప మొదలిడిరి.

ఈసంగతి ఆనోట ఈనోట మహారాజుచెవిన బడినది. అతడు మిక్కిలి సంతసించి "ప్రస్తుతము ఖజానాలో ధనము చాల తక్కువగా నున్నది. కాన ఎట్లయిన యీ యతీశ్వరుని చేత కావలసినంత బంగారము చేయించుకొనవచ్చును" అని తలంచెను. కాని ఈవిషయము మంత్రికి తెలిసినయెడల అంగీకరించడని భావించి ఎట్లైననూ రహస్యముగ సన్యాసితో మైత్రి చేయవలయును అని తలంచెను.

ఆనాటి రాత్రి స్వయముగా తానే బయలుదేరి రాజు యా మునివద్దకు చేరెను. ఆసమయమున ప్రజలెవ్వరును యచ్చట లేకుండిరి. రాజు యతీశ్వరునికి నమస్కరించి "స్వామీ! మీరుగొప్పమేధావులట. మిమ్ము నా నగరునకు ఆహ్వానింప నేనే స్వయముగా వచ్చితి" నని పల్కి అతనిని రహస్యముగ తన నగరుకు తీసుకొనిపోయెను. అంతట మౌని రాజునుగాంచి "ఓ రాజా! మాతో నీ కేమి పని?" యని పల్కెను. అందుల కాతడు "స్వామీ! మీకు బంగారము చేయుట తెలియునట. ప్రస్తుతము మా ధనాగారములో బంగారము తక్కువగా నున్నది. ఆలోటు తమరు పూర్తిచేయుదురని కోరుచున్నాడను" అని పల్కెను.

అందుల కా మౌని చిరునవ్వు నవ్వి "ఓ రాజా! నేను ఎన్నో యేండ్లు మిక్కిలి కష్టపడి ఎండనక, వాననక, అడవులయందును పర్వతములయందును దిరిగితిరిగి తుట్టతుదకు ఈ స్వర్ణయోగమును నేర్చుకొంటిని. నేను ఏవస్తువునైనను బంగారము చేయగలను. కాని అన్నిటికంటెను వెండిని బంగారము చేయుట మిక్కిలి సులభము. తమ రంగీకరించెదరేని నేను రేపె యీ కార్యమును ప్రారంభింతును. మీరు ఎంత వెండి దెచ్చిన నేనంత బంగారు నొసంగెద" నని పల్కెను.

అది విని రాజానందించి "స్వామీ! తమరు ఈ పట్టణమునకు మైలుదూరములో నున్న మా తోటయందు బసచేయుడు. మేము మీకొరకు కుటీరము నిర్మించెదము. ఎందువల్లననగా మా మంత్రికిది తెలిసిన యతడు విఘ్న మొనర్చును. మనకు రాకపోకలు రహస్యముగానే యుండవలయును. మీరుమాత్రము రేపే స్వర్ణయోగము ప్రారంభింపవలయును" అనెను.

అందుల కాతడు మిక్కిలి సంతోషముతో వెడలిపోయి వెంటనే తన

---

తప్పులు చేస్తూనే ఉంటావు" అన్నారు.

బాపూజీ దరహాసితవదనారవిందంతో పల్కిన ఈ మాటలు, అమాయకంగా తప్పులు చేసే బాలుని మందలించినట్లున్నాయి ఆండ్రూస్‌కు! ఆండ్రూస్ చిఱునవ్వుతో ఆ మాటలు స్వీకరించాడు.

శిష్యులగూడి తన మకామును రాజు తోటలోనికి మార్చుకొనెను. అంతట రాజు రెండులక్షల తులముల వెండిని ఆ యోగియొద్దకు రహస్యముగా పంపి తొందరగా బంగారము తయారుకావలె నని ఉత్తరువు నొసంగెను. ఆ మహానియు శిష్యులను సరేయని స్వర్ణ యోగము ప్రారంభించిరి.

ఇది యిట్లుండగా ఈ సంగతి ఎట్లో మంత్రికి తెలిసెను. అతడు విచారించి, తన అమాయకపు రాజు మాయసన్యాసివలలో దగుల్కొని వెండినంతయును పోగొట్టుకొనుచున్నాడని మిక్కిలి విచారించి వెంటనే వేగుల నిరువురిని పిలచి పోయి యతీశ్వరుడుతో వెండి నేమి చేయునది వెంటనే తెలుప నియోగించెను. వేగులవారు ఎప్పటి కప్పుడు మంత్రికి నివేదించుచుండిరి.

మూడవదినమున రాజునొద్దకు మంత్రి ఏతెంచి నదివద్దకు విహారమునకు ఆహ్వానించెను. ఇరువురును అశ్వముల నెక్కి పోవుచుండిరి. కొంతదూరమున నొక కంసాలి కూర్చొని తనదగ్గ రున్న మిత్రులతో తాను గూడ బంగారము చేసెదనని తెల్పుచుండెను. అది విని రా జాశ్చర్యపడి, బంగారము చేయువాడు తన నగరములో కూడ యున్నాడా యని యాశ్చర్యపడెను. వానియొద్దకు పోయి ఇట్లు ప్రశ్నించెను. "ఓయీ! నీ వెట్లు బంగారము చేసెదవో తెల్పుము ?"

అది విని యా కంసాలి, "మహాప్రభూ! నేను పసరులతోగాని, ఆకులతోగాని, మూలికలతోగాని బంగారము చేయను. నేను శరీర కష్టమువలనే బంగారము చేసెదను. నేను కంసాలిని. వెండి బంగారములు తెచ్చి వానితో పలురకముల వస్తువులు చేసి, ఎక్కువ వెలలేక, న్యాయమగు వెల కిత్తును. అందువలన ప్రజలందరును నావద్దనే వస్తువులను కొందురు. ఇట్లు నేను పెక్కుధన మార్జించి ధనవంతుడనైతిని. ఇదియే నా బంగారము చేయు విధము" అని పల్కెను.

అది విని రా జాశ్చర్యపడి మరి కొంతదూరము పోగా, అచ్చట నొక కమ్మరి యచ్చట నున్న వారితో తానుకూడ బంగారము చేసెద నని పల్కుచుండగా వినెను. రాజాతనివద్దకు పోయి, 'నీ వెట్లు చేసెదవని ప్రశ్నించెను.

అందు కా కమ్మరి "స్వామీ! నేను కులమునకు కమ్మరిని. ఇనుము తెచ్చి పలురకములైన వస్తువులను తయారుచేసి, వానిని విక్రయించి ధన మార్జించితినికాని పసరులు, మూలికలవలన గాదు" అని బదులు చెప్పెను.

ఇదియంతయును విని యా రాజు



"మంత్రీ! ఇది యంతయు నీ యుక్తియే. నీవు నాకు బుద్ధిగరపుటకు ఈ నాటక మాడించుచున్నావు. కాని నీ కీ విషయ మెట్లు తెలిసినది? అయిన యా సన్యాసి చెప్పునది అబద్ధమా ?" యని ప్రశ్నించెను.

అందుల కామంత్రి "మహా

(32-వ పేజీ చూడుడు)

# "తండులార్ధంగో - తదర్ధంగో"



**కుమారి రావిపాటి రామాబాయి**

"తాతగారూ! మీ రేమనుకొన్నా సరే కాని అంత చాదస్తంమాత్రం కూడదండీ! మాలవాళ్లను పేరుబెట్టి నోటితో పిలుస్తేనే మైలపడిపోతా నంటా రేమిటండీ? జీతానికి పాలేరు తనం చేస్తున్నారుకదా అని వాళ్ల నలా తృణీకరించి, పేరెట్టి పిలువక,



ఓగడిపోచా? ఓ కత్తా; ఓ బుత్తా! అని పిలుస్తే, వాళ్లకిమాత్రం చీము-నెత్తురులు లేవటండీ? వాళ్లు మూలు ఉక్కున్నారంటే తప్పా? కాలం మారి పోడంలేదూ? మహాత్మాజీ వాళ్లకు చక్కగా 'హరిజనుల' ని పేరెట్టాడు. ప్రభుత్వం - ప్రజలుకూడ వారివైపు మొగ్గుతూవున్నారు. మీరింకా పాతఫాయిలోనే నడుస్తా నంటారు. ఇక మీ ఫణితి మార్చుకోలేకపోతే, రేపు వచ్చే తొలేకాదశికి మీవద్ద పనిమానేస్తామనిపాలేళ్లు-నూకడు, చిన్ననూకడు కూడా నిన్న నాతో ఖచ్చితంగాచెప్పేశారు. పోనీ వీళ్లను మాని ఎవరినైనా పాలేళ్లుగా పెట్టుకొందా మంటే, పైజాతులలో పాలేరుతనం అంటే పండిన పంట అంతా జీతాలకే సరిపోదు. అమర్చుకొందామంటే ప్రభుత్వం ఈనాంబిల్లులు వగైరాలు ఏలా వుంటాయో కదా. వాళ్లని చిన్నచూపు చూడ్డానికి వీల్లేదు. ఏ యెండ కా గొడుగు పట్టాలి. లేకపోతే మీరే బాధపడాలి" అని రామారావు తాతగారనే సంకోచమైనా లేకుండా చెప్పేసి వాళ్లవూరు వెళ్లిపోయాడు.

వెంకటావధాన్లుగారి తాత తండ్రులు గ్రామపౌరోహిత్యం చేస్తూ, వచ్చినరాబడిలో తినగా మిగిలినది, ఎప్పు వందరూపాయిలైతే అప్పుడే ఒక యకరంభూమి చొప్పున కొని పారేశారు. అదంతా డెల్టారావడంతో బంగారం పండుతోంది

అవధాన్లుగారి అసలుపేరు కన్న, వెంకన్నగారు యెక్కువ చదువు సంధ్యలు లేకపోయినా స్థితిగతులు మంచివి అవడంచేత తాత, దండ్రుల పూర్వార్జితపౌరోహిత్యం వదిలేసి ఆచారం, చాదస్తంమాత్రం అట్టేపెట్టుకుని, "ఉత్తమంకృషి" అనే సూత్రంప్రకారం స్వంతకమతం కట్టినడిపిస్తున్నారు. బంధువులందరి ప్రోద్బలంమీద ఓ యజ్ఞం చేసి, అప్పటినుంచి అవధాన్లుగా రయారు. వెంకటావధా[illegible] గారికి పురుషసంతతి [illegible]. ఒక్కర్తే ఆడపిల్ల. ఆమెకు ఇద్దరు మొగపిల్లలు ఇద్దరు ఆడపిల్లలూను. వారంతా యింటికెప్పుడైనా వస్తే "ఇల్లంతా అల్లరిచేస్తున్నారనీ, ఎంగిలి చేతులతో గోడలు, తలుపులు ముట్టుకొంటున్నారనీ" తిట్టి నాల్గు రోజులైనా వుండకుండా వాళ్లింటికి

...పిం చేస్తారు. ఇంట్లో సందడి అంటే సుతరామూ కిట్టదు.

రామారావు పెద్ద మనుమడు, ఇతనిమీద తాతగారికి ప్రేమ వుంది కాని, ఇప్పటినుంచి ఆస్తి చేతికిచ్చి యింట్లో పెట్టుకుంటే తన వొంటరితనాని కేమి భంగం వస్తుందో వని, అది కాకపోయినా చచ్చేముందు యేలాగూ ఆ పని చేయవచ్చు యిప్పు డేం తొందర అనీ లోపలి వూహా.

"బాబయ్యగారూ! వాన వస్తుందని గడ్డిఅంతా కడం వేశామండి, ధాన్యంరాసిమీద గడ్డి దట్టంగా కప్పెట్టామండి. యీ వాళ రాత్రి తవరుకూడా కాంపలాకి రావాలండి బాబూ! చుట్టుపట్ల నాలుగు రోజులనుంచి కమ్యూనిష్టుల గొడవ-అల్లరి ఎక్కువగా వుందండి. మీరు రాసిదగ్గర పడుకొంటే మేం దూరంగా మామిడిచెట్టుక్రింద పడుకుంటామండి. రేపు తెల్లారాక ధాన్యం వూళ్లోకి తోలుకురావచ్చునండి" అన్నారు పాలేళ్లునూకడు, చిన్ననూకడూను.

అవధాన్లుగారు:—"సరే ఆలాగే చేస్తానుగాని ఒరే గడ్డిపరకా! చూడావుకి బరువు మోపు పచ్చగడ్డి కోసుకురా. ఒరే చిన్న గడ్డిపోచా! రేపుప్రొద్దున్న మళ్లీ వూళ్ళోకి రానక్కరలేకుండా నీవు సంచులకట్ట యిప్పుడే పట్టుకువెళ్ళి, ధాన్యంరాసిదగ్గర పడేయి. ఇక మీ గిద్దరు పోండి."

నూకడు, చిన్ననూకడు—"దేటండి బాబయ్యా! మే మనుషులం కావండీ! అలా పిలుస్తారేం ..! వూళ్లో బాపన్నగ్రం దరూ పేరెట్టి పిలుస్తూంటే మీరిలా గంటారు? మేం యేంపాపం చేశామండి అయ్యగారూ! ఖామందులు మమ్మలిని యీనడించి పిలుస్తూవుంటే మీరు వూరుకొంటున్నారు. మిమ్మల్ని సంఘంలో వెలేస్తాము అని మా కులపెద్ద లంటున్నారండి. మమ్మల్ని పేరెట్టి పిలవండి. మాకంతే చాలు. ఇక గడ్డిపరకా, చీపురుకట్టా అని పిలిస్తే మీ పని మానేసి మేం వెళ్లిపోతామండి. మేం మీకు మనుషుల్లాగ కూడా కనపడ్డంలేనట్టుందండి."

ఆరి వీళ్ల దుంప తెగా! వీళ్లకి కళ్లు నెత్తిమీద కొచ్చాయనుకున్నారు అవధాన్లుగారు. ఎప్పుడేనా బరితెగి యింతకుముందు యెదుట యిల్లా మాట్లాడారా వీళ్లు? ఇంతకీ వీళ్ల ననవలసినపనిలేదు. కలి ముంచుకొస్తూంది. ఏమైనాసరే వీళ్లని వాళ్ళపేర్లతో మాత్రం పిలవకూడదు. ఏమౌతుందో చూడాలని పట్టుదల పట్టారు అవధాన్లుగారు.

మార్గశిరమాసం. రాత్రి మంచు దట్టంగా పట్టింది. వెన్నెల కనుమసకగా వుంది. చంద్రుడు అస్తమిస్తున్నాడు. దూరంలో కుప్పలనూర్పు పాలికేకలు వినవస్తున్నాయి. పొలమంతా జీబురుమంటూ వుంది. నూకడు, చిననూకడు పందిరి మామిడిక్రింద గడ్డిపక్క పరచుకొని దుప్పట్లు కప్పుకొని కల్లునిద్దరతో కాలక్షేపం చేస్తున్నారు. ధాన్యంరాసిదగ్గరగా మడతమంచం వేసుకొని అవధాన్లుగారు పడుకుని వస్తూన్న నిద్ర రాపుకొంటూ చిన్నప్పుడు చదువుకొన్న బలరామాయణ, అమరకోశంలో శ్లోకాలు, దాశరథీశతకం, సుమతీశతకంలోని పద్యాలూ వల్లేస్తున్నారు.

ఆ మసక వెల్తుర్లోకి ఒక్కసారి చూచేసరికి ఎవరో నలుగురు వ్యక్తులు ధాన్యంరాసివైపుకు వస్తూన్నట్టు తోచింది. ఎవరని అడుగుదామంటే నోట మాట రాలేదు. ఇప్పటివరకు వల్లె వేస్తూవున్న శ్లోకాలూ, పద్యాలూ ఏమయిపోయాయో తెలియదు. కమ్యూనిష్టుల కల్లోలాలు కళ్లకు కట్టినట్లైంది. ఇంతలోనే ఇంకో పదిమంది వారితో కలిసివచ్చారు. అందరూ రాసిదగ్గర కొచ్చారు. సంచులు సిద్ధంగా వున్నాయి. వాళ్లకాశ్చర్యం వేసింది. వాళ్లకోసమే యివికూడ సిద్ధంగా వచ్చివున్నాయని.

అవధాన్లుగారు మంచంమీద హరహరాగంపట్టారు. మాటా-మంతీలేదు. కదల్లేదు - మెదల్లేదు.

అవధాన్లుగారి అవస్థ చూచి నిర్భయంగా ధాన్యం అంతా ఇట్టే బస్తాల కెత్తేశారు. మూతులు కట్టి బుజాల కెత్తుకున్నారు. గుమ్మ వప్పు

గించి ఇక చూస్తూ వూరుకోలేక పోయారు అవధాన్లుగారు.

పాలేళ్ళని మామూలు అలవాటులో "గడ్డిపరకోయ్" అని కేక వేయా లనుకున్నారు. ఛట్టున జ్ఞాపకం వొచ్చింది "ఇంక ఆ మాట లంటే తక్షణం మీ పని మానేసి పోతాము" అన్న ఆ మాలాళ్ళ మాట. నూకడోయ్ అని పిలుద్దామంటే ఆత్మ-దానమ్మకడుపు కాలా అది దానికున్న స్వాభిమానానికి అలవాటుపడిపోయి, వప్పుకోసడం లేదు లోపల. వెంటనే మెరుపు లాగ ఒక ఆలోచన తోచింది, మధ్యేమార్గం మంచిదని, సంస్కృతంలో తండులార్ధంఅంటే "నూక", "తదర్ధం" అంటే "చిన్ననూక," కాబట్టిఈలా పిలుద్దాం, వాళ్ళ గౌరవానికి, నా ఆత్మాభిమానానికి. ఇదే రాజమార్గ మనుకొని బిగ్గరగా "తండులార్ధంగో" అన్నారు. ఎవరూ పలుకలేడు. "తదర్ధంగో" అన్నారు. కిమి న్నాస్తి తిరిగి "తండులార్ధంగో, తదర్ధంగో" అంటూ వెఱ్ఱికేక పెట్టారు. పాలేళ్లిద్దరు "బేమ్మడు లేచి[illegible]యాదం చదువు కొంటూన్నారురా, మనం ముసుగెట్టుకొని నిద్దరపోదాం రా" అని గుఱ్ఱుపట్టారు. ఇంతలోకే ధాన్యపు రాసికాస్తా మాయమైపోయింది.

"తాతగారూ! నేను చెప్పాను గాదండీ! ఎప్పుడూ కాలంతో పాటు మనంకూడా నడుచుకోవాలి కాని లేకపోతే నష్టం మనకే సిద్ధిస్తుంది. వాళ్లను పేరెట్టి పిలిస్తే, ఆ ధాన్యంలో కొన్నైనా మనకు దక్కేవి. లేని పోని చాదస్తం పడ్డం చేత సాఫుగా వెంకటేశ్వర్ల ముడుపు లాగ నిలువుదోపిడీ చేసేశారు దొంగలు" అన్నాడు రామారావు. గొడ్డు, గోదా చూసు

"శౌనురా అబ్బాయి, బాలాదపి హరినామస్మరణ చేసుకొంటూ సుభాషితం అన్నారు పెద్దలు. ఇక కూచుంటాను" అన్నారు అవధాను ను వ్యాక్యా డుండి యీపాలం, గారు!

# యుక్తి

శ్రీమతి యన్. అన్నపూర్ణ



మీరు వినేవుంటారేమో! మొదటిప్రపంచయుద్ధంనాటి మాట. సైనికాధిపతిదగ్గఱనుంచి ఒక రాష్ట్ర మంత్రికి టెలిగ్రాం వచ్చింది. ఏమని? మీ రాష్ట్రంలో గాడిదలు ఎన్ని ఉన్నాయో, వెంటనే తెలియపర్చవలసిందని. మిలిటరీకి గాడిదల సంఖ్య ఎందుకు అనుకోడానికి లేదు. నిజంగా వారికి అక్కరలేనిది లేదు. "ఇదేం గాడిదల సంఖ్య ఎవరు లెక్కపెట్టిఉంచేరు. దీనికి కొంత కాలం పట్టుతుంది" అని దొర సణుగుకొన్నాడు. ఇటువంటిపనులన్నీ సాధారణంగా కరణాలమీద పడతాయి. ఈ కాగితం ప్రతి గ్రామకరణానికి వెళ్ళాలి. ఆయన లెక్కకట్టి పంపించాలి.

కాని మిలిటరీవారికి ఈ కష్టనిష్ఠూరాలు అక్కరలేదు. మరునాడు ఇంకొక టెలిగ్రాం వచ్చింది. వెంటనే 24 గంటలలోగా పంపించమని. దొరగారికి మతిపోయింది. అప్పుడు పెద్దగుమాస్తాదగ్గఱకు వచ్చి సంగతేమిటని అడిగేడు. దొరగారు జరిగినసంగతి అంతా చెప్పేరు.

"ఓసి ఇంతేనా, మీరు కంగారు పడకండి. నాకు వదిలివేయండి" అన్నాడు, ఆ గుమాస్తా.

రెండుమూడుగంటలు పోయిన తరువాత ఆ రాష్ట్రములోని గాడిదల సంఖ్య పట్టుకొనివచ్చేడు. దొరగారు ఆశ్చర్యంతో ఎలాగు లెక్కకొట్టేవన్నారు.

"మన రాష్ట్రంలో జనాభావట్టీ ఉందికదా. అందులో చాకళ్లు ఎంతమందో చూసేను. ఊళ్లోకి ఒక గాడిద, రేవుకి ఒక గాడిద చొప్పున సగటున చాకలికి రెండు గాడిదలు అయితే మొత్తంగాడిదల సంఖ్య చెప్పడంలో కష్టమేమిటి" అన్నాడా గుమాస్తా. దొరగారు సంతోషించి "ఈ అంకెకి ఇంకో రెండుగాడిదలు కలుపు. ఇలాగున లెక్కకట్టినందుకు నీ వొకటి, అది పంపిస్తున్నందుకు నే నొకటి" అన్నారు.

---

## స్వర్ణయోగము

(28-వ పేజీ తరువాయి)

"ప్రభూ! క్షమింపుడు. నాకీ సంగతి ముందుగనే తెలియును. నేను చెప్పినయెడల మీరు పెడచెవిని పెట్టుదురని తలంచియే మీకిట్లు వీరిద్దరివలన చెప్పించితిని. ఇకనైన మీరా బంగారముమాట విడిచి పెట్టుడు. మీరు చెప్పిన సన్యాసి నిజముగా దొంగసన్యాసి. అతడు మీరిచ్చిన వెండినంతయు నొక రహస్యస్థలమునకు శిష్యులచేత చేరవేయించి భద్రము చేయించినాడు. ఇక రేపో మాపో రహస్యముగ పారిపోవనున్నాడని చారుల వలన తెలిసినది. దేవరవారు చిత్తగించిన వారు దాచియుంచిన స్థలమును చూపెదను" అని చెప్పి రాజును తీసికొనిపోయి వెండి దాచియుంచిన స్థలమును చూపించెను. అంతట రాజు మిక్కిలి క్రోధావేశుడై వెంటనే యా మాయసన్యాసిని, వాని శిష్యులను బంధించి కారాగృహమునం దుంచెను. శరీరకష్టము వలననే బంగారము లభించునను సూత్రమును ఎన్నటికిని మరువకుండెను.

---



అమెరికాలో ఈనాడిరి ఉచిత విద్యాకేంద్రాలలో నాట్యవృత్తి నేర్పుతారు.

# క్రోధం

(15 వ పేజీ తరువాయి)

వూహించుకున్న పురుషునిలో గుణదోషాలు, వాయువు, ధూళి, స్థూలసూక్ష్మభావాలు, అన్నీ మిళితమై వున్నవి. వారిలో యీ స్థూల రూపం, ధూళి లేదు! సాధారణంగా మన యిష్టులు, బంధువులయిన వారి స్థూల స్వరూపం మీదికే మనదృష్టి పోతుంది. అది చూసినప్పుడు ప్రేమ, సూక్ష్మరూపం చూసినప్పుడు శ్రద్ధకలుగుతవి. ప్రొఫెసర్‌లో ఈస్థూలస్వరూపం బొత్తిగా కనిపించదు. షడ్రసోపేతమైన భోజనం ఎప్పుడైనా ఒకసారి లభిస్తేనే రుచికరంగా వుంటుంది; నిత్యాహారం సాదాగా వుంటేనే బాగుంటుంది. భర్తకూడా నిత్యాహారంవంటివాడే!

భర్త తనను క్షమించి, కుసుమకోమలమయినతన హృదయాన్ని నిర్దయగా కాలరాసినఘట్టాలు ఎన్నో జరిగిపోయినై. ఎప్పటిమాదిరే సాయంత్రంకూడా నవ్వుకుంటూ వస్తాడని ఆమెకి నమ్మకం ఏర్పడిపోయింది. ఆదృశ్యం తలపుకొచ్చి, ఆమెకవొంటిమీద జెర్రులు పాకినట్టయింది. "ఆయన ఎంత నిర్దయుడు, నేను కన్నీగమున్నీరుగా యేడ్చినా లెక్కచేయడు" అని మనసులో అనుకుంది.

మధ్యాహ్నం ఇలాగే గడిచిపోయింది. నాలుగ్గంటలయింది. భర్త వచ్చేవేళ అవుతూవుంది. అలానే నవ్వుకుంటూ వస్తాడని అనుకోగానే ఆమె మండిపోతూవుంది. ఎప్పటిమాదిరే వస్తారు, దానికి భిన్నమేముంటుంది? ఆమెమనస్సుకి వెగటు కలిగింది.

అయిదుగంటలయింది. ఇంకా రాలేదు. కుముద కొంచెం వులికిపడింది. ఎందువల్ల రాలేదు? ఎన్నడూ ఆలస్యం చేయరు. నాల్గింటికల్లావచ్చేసేవారు. అదీగాక యివాళ సోమవారం. సోమవారంనాడు మూడింటికే వచ్చేవారు. మరుక్షణమే 'నవ్వుకుంటూ వస్తాండవచ్చుని అనుకుని, మళ్లీ ఆమె మండిపడింది. వారు రావటంలో ఆలస్యం కావటంవల్ల, మనస్సులో కలుగుతున్న కోమలత్వము, మధురవుదానికనక మాయమై మళ్లీ ఆమె మనస్సు సుళ్లు తిరిగిపోయింది.

ఆరుగంటలయింది, ఏడయింది. చలికాలం. సాయంకాలం చాలా దీర్ఘంగా, భారంగా గడిచింది. చీకటిపడింది. భర్త ఇంకా రాలేదు. కుముద వసారాలో ఎదురు చూస్తూవుంది. ఉండివుండి ఆమె వ్యాకులపడుతూవుంది. వారికి కోపం వచ్చిందని కుముదకి తెలియదు. ఆమె విసవిసమంటూ, వారిని విడిచి వంటింట్లోకి పోవడం వలన వారికి కోపం వచ్చిందని తెలుసుకోలేకపోయింది. ఒకవేళ వారికి కోపం వచ్చిందేమోననే సందేహంకూడా కలిగింది. దీన్ని ఆధారం చేసుకునే ఆమె లోలోపల ఆనందపడుతూవుంది. సందేహం గట్టిపడినకొద్దీ, ఇంకా ఆనందపడుతూవుంది. ఒకవంక వ్యాకులత, మరోవంక ఉల్లాసం. ఆమె మనస్థితి చాలా విచిత్రంగా వుంది. లంకంతయింట్లో వొంటరిగా కూచోటానికి భయంకూడా కలుగుతూంది. ఆ సుకుమార హృదయం భయసందేహాలతో, వుల్లాసంతో వూగిపోతూవుంది. తనకి అప్రియమయిన వ్యక్తి కోపంగావున్నందుకు, అమృతరసాన్ని గ్రోలుతూవుంది. వొంటరిపాటు, భయము ఎక్కువయినప్పుడు, పొరుగింటి గృహిణిని పిలుద్దామనుకొనేది. కాని పిలిచేదికాదు. మనస్సును వివిధభావాలు అల్లకల్లోలం చేసేటప్పుడు, బాహ్యజగత్తు ఒకవిధంగా తన మహాత్మ్యాన్ని కోల్పోతుంది. పొరుగింటావిడని పిలుచుకురావటం బాహ్యజగత్తుకు సంబంధించిన క్రియ! వారికి కోపం వచ్చిందని ఆమెకిప్పుడు గట్టిగా నమ్మకం కలిగింది. వారిని ఎలా బతిమాలుదామా అని మనసులో వూహించుకుంటూ వుంది. ఇవాళ నారీహృదయంలోని ఒకగొప్పవాంఛ సఫలంకాబోతూ వుంది. నేడు వారి పాదాలమీదవాలి సంపూర్ణంగా ఆత్మసమర్పణ చేయాలని అనుకుంది.

ఆలస్యమయినకొద్దీ, ఆమె భావాలు తీవ్రతర మవుతున్నాయి. ఊరికే ఆమె నేత్రాలు కన్నీటితో నిండిపోయినవి. అయినా హృదయాంతరాళంలో ఉల్లాసాన్నే పొందుతూ వుంది.

ఎనిమిదయింది. ఇంతవరకు ఐపులేదు. ఆమె మనోభావాలు తీవ్రత్వాన్ని అందుకున్నవి. వారు కోపంగా వున్నారని నమ్మకం కలిగి, ఆమె ఆనందంలో మునిగి తేలుతూ వుంది. హృదయాంతరాళంలో పొంగిపొరుతున్న ఈ ఆనందం క్రమంగా ఆమె మనస్సును ప్రశాంతపరిచింది. చంచలత లేదు. అనుభూతి తీవ్రస్థితినిపొందినప్పుడు, దానిలో ఒక విధమగు కమ్మని బాధ, వేదన నిండివుంటుంది. కుముదమనస్సు పరస్పరవ్యతిరేక భావాలతో ఎంతచంచలంగా వుందో, ఆమె వదనం అంత ప్రశాంతంగా వుంది. అప్పటి ఆమె మనోగతిని సరిగా వర్ణించటం సరస్వతికి కూడా అలవికాదు. ఆమె యిప్పుడు బాహ్యజగత్తులో కాదు, మనోజగత్తులో వూపిరి పీలుస్తూవుంది. చలిగాలికి నిలువెల్లా కంపించినా, అక్కడనించి లేవలేదు. చీర సరిగా సర్దుకుని కూచుంది.

ఇంతలో భర్త వచ్చాడు. తరంగాలు ఏ విధంగా వొడ్డుని తాకి, ఆత్మార్పణ చేస్తవో, అదేవిధంగా కుముద "క్షమించండి" అంటూ వారి పాదాలమీద వ్రాలింది. ప్రొఫెసర్ లేవదీద్దామని వంగితే, కుముద మూర్ఛిల్లి వుంది.

[శ్రీ సతీశకుమార్ బెంగాలీకథకు అనువాదం]



పదమటి యూరోపియను నాయకుల సమావేశం షిస్వెల్ ప్రభృతులైన అయిదు బ్రసెల్సు సంధి రాజ్యాల రక్షణ మంత్రులు యోనియుక్ ప్రధాన కార్యాలయంలో సమావేశమైనారు.

# నామకరణం

(16-వ పేజీ తరువాయి)

"రాకూడదని నే నన్నానండీ రాలేదని అన్నాను వస్తే వచ్చిందని అనడానికే నాకేం" అంటూ కొంచెం మొహం ముడుచుకుంది

"పోనీ - యేది వచ్చి యేది రాకున్నా నీ సోదిమాత్రం నీ మనమరాలికి రాకుండా వుంటే సంతోషిస్తాం" అన్నాడు నాన్న

అందరం నవ్వాం అమ్మకు కోపం వచ్చినది యింట్లోకి వెళ్లుతూ "యేదో లెండి, ఈసోదితో యెలాగో కాలం గడిచింది" అని గొణిగింది

* * *

భోజనం చేస్తూవున్నప్పుడు అమ్మ అడిగింది. "చంటిదానికి యేం పేరు పెట్టాలని అనుకుంటున్నావురా నాయనా" అని

"యేదో మీ యిష్టమొచ్చింది పెట్టండమ్మా - పెద్దవాళ్లుండగా మా దేమిటి" అన్నాను నేను

"యిప్పటి పేర్లు యెవరికీ తెలియాలి కాబట్టి రెండే అక్షరాలు మెరవుల్లాగ ఉంటాయ్ గిరి - సుశీ-లత-సుశ్రీ-రమ అశ్వి-రామరాను ఒక్కక్షరం పేర్లు వస్తాయేమో క - గ - అ - ఇ - అని" అంది అమ్మ.

"పోనీ నీ యిష్టమొచ్చినట్టు పెట్టుకోవమ్మా" అన్నాను నేను

"అసలు విషయం చెప్పడం మరచాను మీ బామ్మకు నీవంటే ప్రాణం, పాపం బతికి వున్నప్పుడు క్షేమకాంక్షి యెన్నో సార్లు అంటూ వుండేది నీ కడుపులో పుడతానని. మీ నాన్నకుగూడా ఆమె పేరు పెట్టుకోవాలని వుంది." అని అన్నది అమ్మ

"అయితే సరి - ఆమె పేరే పెట్టండి" అన్నాను

* * *

కనకం అడిగింది "యేమండీ అమ్మాయి పేరు యేం పెట్టుకుందాం" అని

"నీయిష్టం వచ్చింది పెట్టు కనకం" అన్నాను

"మా అమ్మ పేరు పెట్టుకోవాలని వుందండీ ఆమె జ్ఞాపకార్థం మా నాన్న మొన్న వచ్చినప్పుడు అదే అన్నాడు. అమ్మ పోయి యిప్పటికి నాలుగుసంవత్సరా లయింది మొన్న స్వప్నంలో కనపడి చెప్పింది. తన జ్ఞాపకార్థం తనపేరు పెట్టుకొమ్మని' అంది కనకం.

"అయితే యింకేం. ఆ పేరే పెట్టుకో" అన్నాను నేను.

* * *

నామకరణంరోజు నాన్న అడిగాడు. "బిడ్డకు యేం పేరు పెట్టుకుంటావయ్యా" అని.

"వెంకటరత్నం" అన్నాను నేను.

"అబ్బే - యేం బావుంటుందిరా - పాత పేరు" అన్నాడు నాన్న

"బామ్మపేరు, అత్తయ్య పేరు కలిసి వస్తుంది నాన్నా యీ పేరులో. బామ్మ పేరు పెట్టాలని కొందరి యిష్టం అత్తయ్య పేరు పెట్టాలని కొందరి యిష్టం. అంచేత అందరినీ సంతోషపెట్టడానికి ఈ పేరు బావుంటుందని నా వుద్దేశ్యం" అన్నాను నేను

"అలాగా.. బాగానే వుంటుంది" అన్నాడు నాన్న

* * *

పాప కనకం చేతుల్లో వున్నప్పుడు 'రత్నం' అని పిలుచుకొని మా కనకాన్ని సంతోషపెట్టున్నాను

పాప అమ్మనాన్న చేతుల్లో వున్నప్పుడు 'వెంకటా' అంటూ పిల్చుకొని వాళ్లని సంతోషపెట్టున్నాను

అంతా కలిసి కూర్చున్నప్పుడు 'వెంకటరత్నం' అని పిల్చుకొని అందరినీ సంతోషపెట్టున్నాను.

వీరితోపాటు యింకో యిద్దరినీ సంతోషపెట్టున్నానేమో ?

అందరిసంతోషమే నా సంతోషము

## అవమానం

(19-వ పేజీ తరువాయి)

వంటా, ఆగకపోయిన పనులగురించి తనకు పూచీ తప్పిపోతుందికదా. అని పెద్దకోడలు కూడా ఆహ్వానించింది అత్తగారిని రమ్మని!... కొన్నాళ్ళపాటయినా లక్ష్మి సుఖంగా ఉంటుంది కదా అన్న ఆశతో, తల్లిని వెళ్లమని ప్రోత్సహించాడు చిన్న కొడుకు. ఏమయినా చిన్నకోడలి దగ్గర తను మసలలేనన్నే కారణంచేత, రుద్రాక్షమ్మ 'గోమో' వెళ్ళిపోడం తటస్థించింది.

"రెండో కోడలి బాగ పడలేక, ఆ మహా సాధ్వి రుద్రాక్షమ్మగారు పెద్దబ్బాయి దగ్గరి కెళ్ళిపోయేరు." అని అమ్మలక్కల సమావేశంలో అనుకున్నారు. ఆ ఊరివాళ్ళ దృష్టిలో లక్ష్మి మహా పాపిష్ఠిదానిలా పరిగణించబడింది. "ఇదంతా పూర్వజన్మ సుకృతం" అని లక్ష్మి వేదాంతమార్గంలోకి పోయి సముదాయించుకొనేది.

ఇప్పుడు లక్ష్మి జీవితంలో కొన్ని బాధలు తప్పాయి!... మనపటికన్నా ఎంతో హాయిగా కాలక్షేపం చేస్తున్న దనక తప్పదు. కామయ్యతో సరదాగా కాలక్షేపం చేస్తున్నది లక్ష్మి!

"ఇప్పుడసలురోజూ కోమూ త్రైనా స్నానం చేస్తున్నావా? అసలు మడిపంచంటూ ఓటి, ఉంటున్నదా?" అని నవ్వుతూ అడిగేడు కామయ్య.

"ఊఁ...మీకంత వేళాకోళంగా ఉందన్న మాట! అబ్బ!...అవాసన ఇంకా పూర్తిగా పోలేదు. ఇప్పటికీ మంచాల్నీ, వాటినీ ముట్టుకుండుకు దడుస్తూఉంటాను మళ్లీ స్నానం చెయ్యవలిసొస్తుందేమోనని!" ఆ మాటలు అని నవ్వుతూ నాలుక కరచుకుంది లక్ష్మి.

"అబ్బో!... మాట్లాడ్డమే మరిచిపోయే వనుకున్నాను. మళ్ళీ నువ్వు పూర్వపు లక్ష్మి వయ్యావ్." అన్నాడు కామయ్య.

ఇంతలో, వీధి తలుపు చప్పుడయింది. టపాబంట్రోతు ఓ ఉత్తరం తీసుకొచ్చి ఇచ్చేడు. ఆత్రుతతో చదివేడు కామయ్య.

"ఎక్కడినుంచి?" అడిగింది లక్ష్మి.

"మా అన్నయ్యదగ్గరనుంచి. మాఅమ్మకు జబ్బుగా ఉందట! పక్షవాతంలా ఉందట!.. మా వదినెకు సరిగ్గా సంరక్షణ చేయడం చేతకాదట. అంచేత మనల్ని రమ్మని వ్రాశాడు. లక్ష్మిని... చూడాలని ఉందని మాటిమాటికీ అంటున్నదటఅమ్మ" అప్రయత్నంగా కామయ్య కళ్లవెంబడి నీళ్లు కారేయి!

"అయ్యో! అలాగటండీ, అయితే మనం త్వరగా వెళదాం!" అంది లక్ష్మి.

మర్నాడే బయలుదేరి వెళ్లారు. గుమ్మంలో కాలుపెడుతూనే, "అమ్మా!...మట్లావున్నావు? అయ్యో!... ఇదేమి టిలా అయిపోయేవు" అంటూ అమ్మచేతులు పట్టుకొన్నాడు కామయ్య!... "అత్తగారూ, ఇదంతా ఏమిటండీ, అయ్యో!... ఇదేం గ్రహచారమండీ?" ఆందోళనతో అంది లక్ష్మి. వెర్రిగా చూడ్డం మొదలు పెట్టింది రుద్రాక్షమ్మ. కళ్లంట నీరు ధారగా కారుతున్నది.

"మరే హాతుంది! అయినా మరీ అంత చాదస్తమూ! అందుకే ఇదంతా. లేకపోతే ఇష్టం వచ్చినప్పుడల్లా స్నానంచేస్తూ, చీటికీ మాటికీ అందర్నీ తిడుతూఉంటే ఏమవుతుంది?" అంది పెద్దకోడలు కమల ప్రక్కనే నిలబడి.

"ఊరుకోండక్కయ్యా. ఇలాంటిసమయంలోకూడా అవేం మాటలు?" అంది లక్ష్మి.

"ఓ!.. మహా అభిమానం దొర్లుకొచ్చింది. చాల్లే నువ్వూరుకో!" అంటూ విసవిసా గదిలోకి వెళ్ళిపోయింది కమల.

లక్ష్మివైపు దీనంగా చూచింది రుద్రాక్షమ్మ!... ఏదో మాట్లాడదామని ప్రయత్నిస్తున్నది కాని నోటంట మాట రాలేదు. ఆఖరి కెలాగో "ల...క్ష్మి..." అనేసరికి దుఃఖంలో మాటరాలేదు.

"ఏమండీ!... త్వరగా మనూరు తీసుకుపోదాం. అక్కడ ఏమయినా ఆయుర్వేదం మందులు ఇప్పిస్తే, మళ్ళీ కాలూ, చెయ్యీ వస్తాయేమో! ఇక్కడి సరిగ్గా చూచేవారే లేరు." అంది లక్ష్మి భర్తతో!

కోడలువైపు దనంగా చూచింది, రుద్రాక్షమ్మ. తర్వాత గట్టిగా కళ్లుమూసుకుంది రుద్రాక్షమ్మ. కళ్లలో నీరు పూర్తిగా అయిపోతుందని కాబోలు ఆమె భయం!

---

# సింహళము-సిగిరియా కుడ్యచిత్రములు

శ్రీ ఆకుంది వెంకటశాస్త్రి

కశ్యపుడను రాజు సింహళద్వీపమున 5 వ శతాబ్దమున 'సింహగిరి' పై నిర్మించిన దుర్గమునగల సిగిరియా కుడ్యచిత్రములు (Frescoeo) (దక్కన్) హైదరాబాదునకు సమీపమునగల అజంతాకుడ్యచిత్రములంత ప్రసిద్ధమైనవియే. కొన్ని విషయములలో యీచిత్రములు అజంతాచిత్రములను పోలియున్నవి. సింహళద్వీపమునకు మధ్యభాగమున గల 'పోలోన్నరువ' అను నగరమునకు పశ్చిమమున 20 మైళ్లదూరములో సింహగిరి యని ప్రసిద్ధినందిన పర్వతమే యీ సిగిరియా సిగిరియాపర్వతము.

సుమారు 1500 సంవత్సరముల క్రితము కశ్యపుడను రాజు తన రాజధానీనగరము 'అనూరాధపురము'లో నుండుట తనకు సురక్షితము కాదని భయపడి దుర్గమమైన సింహగిరిపై వింతయైన భవనమును కట్టించుకొని, ప్రపంచమువలని భయమును బాపుకొనుటకును ఒక కోటను నిర్మించుకొని తగు రక్షణ చేసికొనెను. ముఖ్యముగ తన సవతిసోదరుడగు "మొగ్గల్లన్న"వలని భయమువలననే ఇంత జాగ్రత్తపడినది. ధాతుసేనుడను రాజుకొమరులిద్దరిలో నొకడు కశ్యపుడు. కశ్యపున కొక సోదరియు కలదు. ఆమె రాజుయొక్క సర్వసేనానిని పెండ్లియాడెను. రాజకుమారి తన తండ్రితో ఆమెభర్తయు, అత్తగారును ఆమెను క్రూరముగ జూచుచున్నారని చెప్పెను. ధాతుసేను డంత వారిపై కోపించి అత్తగారున్న యింటికి నిప్పంటింపజేసి యామెను, చంపెను. తన తల్లి నీవిధముగ క్రూరముగ ధాతుసేనుడు చంపినందుకు అతనిపై పగదీర్చుకొనుటకు రాజుయొక్క సర్వసేనాని కశ్యపుని ప్రేరేపించి అతనిచేతనే తండ్రిధాతుసేనుని చంపించి, రాజ్యమును కశ్యపు డేలునట్లు చేసెను. కశ్యపుడు తనబావగారి ప్రేరణము వలన తనతండ్రినే పట్టుకొని అతనిని జీవముతో నుండగనే భూమిలో పాతింపజేసెను. తన సవతిసోదరుడు మొగ్గల్లన్నను కూడ చంపబూనెను. కాని అతడు హిందూదేశమునకు పారిపోయి అచట గొప్ప సైన్యమును చేకూర్చుకొని సిగిరియాపై దండెత్తి తన సవతిసోదరుని సైన్యముతో పోరి యతని సైన్యము నోడించెను.

కశ్యపుడు దుర్గమమైన సిగిరియాదుర్గమును వీడి కోట వెలుపలి మైదానముమీదికి పోయి కోటవెలుపలి శత్రుసైన్యము నెదుర్కొనెను. తన సవతిసోదరుని చేజిక్కిపోవలసివచ్చునేమో యను భయమున యుద్ధరంగముననే కత్తితో తన్ను తానే పొడుచుకొని చచ్చిపోయెను. మొగ్గల్లన్న జయము పొంది అనూరాధపురమును ఆక్రమించుకొని అనేకవత్సరములు రాజ్యపాలన మొనర్చెను. అతని తరువాత అతనికుమారుడు కుమారధాతుసేనుడు రాజ్యపాలన మొనర్చెను. సిగిరియా కోటను గూర్చి సింహళద్వీపరాజుల చరిత్రనుండి తెలియవచ్చు విషాదగాథ యిది. కొంతకాల మిటుల సిగిరియాకోట రాజు లెవ్వరిచేతను ఆక్రమింపబడకయుండ, కొన్నాళ్లకా కోట ఒక బౌద్ధ సన్యాసుల సంఘమునకు స్వాధీనమయ్యెను. సిగిరియా కొండపై 40 అడుగుల యెత్తున రెండు విశాలములైన వివరములు (గదులు, గుహావంటివి) తొలువబడెను. ఈ గుహలలో అత్యంతరమణీయములైన కుడ్యచిత్రములు స్త్రీమూర్తుల ఆంగవిన్యాసములు వర్ణశోభతో విరాజిల్లుచున్నవి.

ఇవి బహుశః కశ్యపుడు సిగిరియా పర్వతముపై వసించుచుండిన కాలమున కోటను కాపాడుటకు నియమింపబడిన భటవర్గములో నెవ్వడో యీ చిత్రవర్ణకుడ్యచిత్రములను రచియించి యుండెనని యూహింపబడుచున్నది. సమ్మోహనమైన యీ స్త్రీచిత్రములే అచటి వన్నియును. చిత్రములన్నియు అతి సున్నితమైన రేఖలతో విరాజిల్లుచు విచిత్రమైన వర్ణములతో ప్రకాశవంతమై యున్నవి. పేస్టల్ వర్ణములని వానికి పేరు. చిత్రకళావిమర్శకులు యీ చిత్రములకును దక్కన్ హైదరాబాదునకు సమీపమునగల అజంతా చిత్రములకును అత్యంతమగు సమీచీనత కలదందురు. ఈ సిగిరియాకుడ్యచిత్రములు దేశచరిత్రకు సంబంధించినవి కావు. అజంతాకుడ్యచిత్రములు చరిత్రకు సంబంధముకలవిగా నున్నవి. సిగిరియా కుడ్యచిత్రములు అలంకార ప్రాయములు, చిత్రకళావైదగ్ధ్యప్రదర్శకములు. ఇందలి స్త్రీ చిత్రములు మత సంబంధమును కూడ సూచించునవి కావు. ఈ స్త్రీమూర్తులు కశ్యపుని దర్బారులోని రాణివాసపు స్త్రీలుగా తోచుచున్నవి. చిత్రములను రచించిన చిత్రకారు డెవ్వడో తెలియదుకాని అందలి వర్ణములు, రేఖలు మాత్రము చాల గంభీరముగను లలితముగను కనపడుచున్నవి. ఈ కుడ్యచిత్రములు ప్రభవిల్లినకాలము సింహళద్వీపమున నాగరకత, కళలు విజృంభించిన కాలము, ఆ దేశము మిక్కిలి ఉచ్ఛస్థితి నున్న కాలము. ఉత్తరహిందూస్థానమున గుప్తరాజులు పరిపాలించిన కాలము.

డాక్టరు ఆనందకుమారస్వామిగారు యీ సిగిరియా కుడ్యచిత్రములలో రూపింపబడిన స్త్రీలు అప్సరసలు, దేవతాస్త్రీలు, గంధర్వనాట్య సుందరీమణులని యభిప్రాయపడిరి. వేరొకకళావేత్త, ఆ స్త్రీరూపములు మేఘలతలు, విద్యుల్లతలు అని పేర్కొన్నాడు. ఆ స్త్రీల చేతులలో తామరపుష్పములు, ప్రొద్దుతిరుగుడు పూలు, కలువలు ఉన్నట్లు చిత్రింపబడినవి. ఒక గుహలో 17 స్త్రీ చిత్రములు, రెండవ గుహలో 5 చిత్రములును కలవు. ఈ చిత్రము లన్నియు ఆ కాలమున సింహళదేశపు స్త్రీ వస్త్రాలంకారముల తీరును చిత్రించును. ఈ కుడ్యచిత్రములలో నుపయోగింపబడిన వర్ణములు – ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ, నలుపు, తెలుపు. హిందూదేశములోను, ఇండోనీషియాలోను, సింహళమునను చిత్రకళ, శిల్పము విజృంభించిన స్వర్ణయుగమది.

---

# నేటి ప్రపంచం

## కాశ్మీర్ సమస్యపై సమాలోచనలు *

కాశ్మీర్ సమస్యపై భారత, పాకిస్థాన్ ప్రధానమంత్రులు పండిట్ నెహ్రూ, లియాఖత్ అలీఖాన్, భద్రతామండలి నియమించిన మధ్యవర్తి సర్ ఓవెన్ డిక్సన్ గార్ల సమాలోచనలు ఢిల్లీలో అయిదు రోజులు నడిచాయి. ఈ సమాలోచనల ఫలితంగా పరిస్థితి యథాతథంగానే ఉందిగాని మారలేదు. అయితే డిక్సన్‌గారికి వాదోపవాదాలు క్షుణ్ణంగా తెలియడానికి ఉపయోగపడ్డాయి. "కొన్ని ముఖ్యసూత్రాల్ని గురించీ, ఆ సూత్రాల్ని అమలు జరపడానికి రకరకాల మార్గాల్ని గురించీ చర్చ జరిగింద"నీ, "ఈ సమస్యకు సంబంధించి కొన్ని ఇతరఅంశాల్ని కూడా చర్చించార"నీ ఒక అధికారప్రకటన వెలువడింది.

ఈ ఇతరఅంశాల్ని గురించి బాగా ఆలోచించడం అవసరమని తోచినందువల్ల కొన్ని రోజులు వ్యవధి తీసుకుంటున్నారట. ఆపైన కొన్నిరోజుల్లో తిరిగి కరాచీలో సమావేశం జరుగుతుందట.

సమావేశాన్ని జరిపినది మధ్యవర్తి డిక్సన్. ప్లెబిసైట్ జరపడానికి సరైన పరిస్థితుల్ని ఏర్పాటుచెయ్యడానికిగాను కాశ్మీరంనుంచి సైన్యాలని ఉపసంహరించుకునే విషయమై ఉభయ ప్రభుత్వాల మధ్యనూ ఒక ఒప్పందం కుదర్చడం వీరి కర్తవ్యం. సైన్యాల ఉపసంహరణ గురించే చర్చ జరిగిందనుకోవాలి. సైన్యాల ఉపసంహరణ విషయంలో ఉభయప్రభుత్వాలూ పాతపాటలేమిటి ఉంటాయనడంలో సందేహం అనవసరం. భారతసైన్యాల్ని ఎప్పుడు ఎంతెంత ఏవిధంగా ఉపసంహరించుకునేది పాకిస్థాన్‌ప్రభుత్వానికి నిమిత్తం లేదని భారతప్రభుత్వవాదన. ఉభయసైన్యాలూ ఒకేసారి సరిసమానంగా ఉపసంహరించబడాలని పాకిస్థాన్‌వాదన. పాకిస్థాన్ ఆక్రమించుకున్న ప్రాంతంనుంచి ఉపసంహరించవలసింది పాకిస్థాన్ సైన్యాల్నేగాక "అజాద్ కాశ్మీర్ సైన్యా"లనే పేరుతో ఊరేగుతున్న పాకిస్థాన్ సైన్యాల్నీ, పఠాన్ దాడిమూకల్నీ కూడా నని భారతప్రభుత్వం వాదన. అంతేకాదు. అసలు అజాద్ కాశ్మీర్ సైన్యాలని చెప్పుకునే సైన్యాల్లో అన్యప్రాంతీయులు (పాకిస్థానీలూ పఠాన్లు) వెళ్ళిపోగా మిగిలేవారిని నిరస్త్రుల్ని చేసి ఈ దళాన్ని రద్దుపరచాలనికూడాభారతప్రభుత్వం వాదిస్తోంది. అలా వీల్లేదని పాకిస్థాన్ వాదిస్తోంది. ఉత్తరాన పర్వతమయప్రాంతమైన గిల్గిట్ మొదలైన మండలాలలో తమ సైనికులు ఉండాలని భారతప్రభుత్వం వాదిస్తుంది. తమ సైనికు లుండాలని పాకిస్థాన్ వాదిస్తుంది.

ఇవే వాగ్వివాదాలు మొదటినుంచీ జరుగుచున్నాయి. సర్ ఓవెన్ డిక్సన్ మాత్రం మొట్టమొదటిసారిగా ఈ వాదాల్ని ప్రధానమంత్రుల ముఖతః విన్నారు.

ఈ మామూలు వాదాలుగాక ఈ సమస్యకు, సంబంధించిన "మరికొన్ని కొత్త అంశాలను కూడా" చర్చించినట్లు అధికారప్రకటన తెలుపుతోంది.

ఇటీవల బ్రిటిష్ సైనికాధిపతి సర్ విలియమ్ స్లిమ్ కామన్వెల్త్ దేశాలన్నిటినీ పర్యటనచేసి దేశరక్షణసమస్యలను చర్చించాడు. ఢిల్లీలోనూ కరాచీలోనూ భారత పాకిస్థాన్ సైనికాధిపతులతో సంప్రదింపులు జరిపాడు. ప్రస్తుతపరిస్థితిలో భారతపాకిస్థాన్ ప్రభుత్వాలు కలిసి భరతఖండం రక్షణకై సమష్టిదేశరక్షణ సంఘాన్ని స్థాపించుకోవడం అవసరమని స్లిమ్ సూచించాడు. ఈవిషయమై ఉభయ ప్రభుత్వాలమధ్యనూ సమాధానం చేకూర్చడానికి యత్నాలు జరిగినట్లు బ్రిటిష్‌దేశరక్షణశాఖామంత్రి షిన్వెల్ పార్లమెంట్‌లో చెప్పాడు.

బహుశా ఢిల్లీలో నెహ్రూ, లియాఖత్ అలీఖాన్, డిక్సన్‌ల సమాలోచనల్లో చర్చించబడిన కొత్త అంశాల్లో ఇదొకటి అయి ఉండవచ్చును.

స్లిమ్ సూచనలకు ముందు కాశ్మీర్ సమస్యాపరిష్కారానికి భారతదేశరక్షణకీకూడా కాశ్మీరంలో ఉభయసైన్యాల ఆధ్వర్యం కిందనూ సమిష్టిరక్షణ ఏర్పాట్లు చేయడం మంచిదని కొందరు సూచనలు చేశారు.

అంటే కాశ్మీరుసమస్యకీ దేశరక్షణ సమస్యకీ ముడిపెడుతున్నారన్నమాట. ఈప్రకారమైనా కాశ్మీరంలో సైనికోపసంహరణకుగాని దేశరక్షణకుగాని ఉభయ ప్రభుత్వాలమధ్యనూ సమాధానం సాధించాలని వీరిప్రయత్నమై ఉండవచ్చును. అంటే సైనికోపసంహరణలోనూ కాశ్మీరదేశరక్షణలోను భారతదేశంతో పాకిస్థాన్‌కి కూడా సమానబాధ్యతను అంటగట్టడానికి యత్నం జరుగుతున్నది.

కాశ్మీర్ సమాలోచనల్లో ఏవిషయాల్ని చర్చించాలో డిక్సన్ ముందు నిర్ణయించలేదు. ముగ్గురూ సమావేశమై చర్చనీయాంశాల్ని కూడా నిర్ణయించుకున్నారన్నమాట. అంటే కాశ్మీరసమస్య దాడి మొదలు సైనికోపసంహరణవరకూ, జనవాక్యనిర్ధారణ మొదలైన సమస్యలన్నిటినీ చర్చించి ఉండాలి. అందువల్లనే పాతవాదోపవాదాలే తిరిగివచ్చి ఉండాలి. కాబట్టి సమాధానం కుదరలేదు,

ఈ కొత్తఅంశాల్ని సావధానంగా ఆలోచించి తిరిగి కరాచీలో చర్చిస్తారు.

సమాలోచనల ఫలితాన్ని త్వరలోనే డిక్సన్ భద్రతామండలికి అందజేయగలరు. సైనికోపసంహరణపై చర్చల సారాంశమేమి తేలినదీ, లేక సైనికోపసంహరణతో నిమిత్తము లేకనే ప్రజాభిప్రాయమును తెలుసుకొనడానికి వీలున్నదీ లేనిదీ, జనవాక్యనిర్ధారణనిర్వహణ సాధ్యంకానట్లయితే మరొక విధానమేదైన అనుసరించడానికి వీలున్నదీ లేనిదీ క్రమంగా చర్చించబడవచ్చును.

జనవాక్యనిర్ధారణసంగతి ఏమీ తేలనందువల్ల ఐక్యరాజ్యసమితి ఉద్యోగంనుంచి ఎడ్మిరల్ నిమిట్జ్‌ను మూడుమాసాలై పంపించివేశారు. ఢిల్లీ సమాలోచనల అనంతరం మళ్ళీ ఆయన్ని ఉద్యోగంలోకి సమితి కార్యదర్శి ట్రిగ్వేలీ రప్పించారు. దీని ఆంతర్యమేమో ఢిల్లీలో ఎవరికీ బోధపడలేదట.

లియాఖత్ అలీఖాన్ తిరిగి పాకిస్థాన్ వెళ్ళిపోయేముందు అల్పసంఖ్యాక వర్గాల రక్షణనిమిత్తమై ఏప్రిల్లో జరిగిన ఢిల్లీ ఒడంబడిక ఏరీతిగా అమలుజరుగుతున్నదీ నెహ్రూతో కలిసి సమీక్ష చేశారట. పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్‌కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సందర్భంలో అవసరాన్నిబట్టి నెహ్రూ లియాఖత్ అలీఖాన్ లిద్దరూ కలిసి పశ్చిమబెంగాల్‌ను సందర్శించి పరి

స్థితుల్ని స్వయంగా చూడ్డం మంచిదని వారు ఇద్దరు ప్రధానమంత్రులకీ సూచన చేశారు.

## అమెరికాపై పిడుగు *

ఏడు మాసాలుగా భద్రతామండలినుంచీ, ఐక్యరాజ్యసమితి ఇతర సంస్థలనుంచీ గైర్‌హాజరవుతున్న రష్యా, భద్రతామండలిలో అధ్యక్షస్థానం ఆక్రమించవలసిన మాసం వచ్చేసరికి, హాజరు కాగలదని ప్రకటించింది. దీనితో అమెరికన్ ప్రభుత్వానికి నెత్తిపైన పిడుగు పడినంత పనయింది. రష్యా రావడంలో ఏదో పెద్ద యెత్తుందని వీరి అనుమానం. వెంటనే లండన్ పారిస్, వాషింగ్‌టన్ నగరాలమధ్య రహస్య సమాలోచనలు ప్రారంభమైనాయి. భద్రతా మండలిలోని అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, నార్వీజియన్ ప్రతినిధులు సమావేశమై, రష్యన్ ప్రతినిధి అధ్యక్షతకింద జరగబోయే సమావేశంలో ఎవరెలా ఏయెత్తులకి కొనుకోవాలో నిర్ణయించుకుంటున్నారు. చీనా ప్రతినిధిని గురించిగాని ఈక్వెడార్, క్యూబా ప్రతినిధుల్ని గురించిగాని వీరికాట్టే చింత అనవసరం. వీరెలాచేస్తే వారలా చెయ్యక తప్పించుకోలేరనే గట్టినమ్మకం ఉంది.

రష్యా ఎత్తుల్ని గురించి అనేక ఊహాలు వచ్చాయి.

చీనాసభ్యత్వం సంగతి ఏదో తేల్చడానికే రష్యన్ ప్రతినిధి జాకబ్ మాలిక్ వస్తున్నాడనుకుంటున్నారు. పండిట్ నెహ్రూ చేసిన సూచనలు అమలుజరపడానికే రష్యా ప్రయత్నిస్తున్నదనుకుంటున్నారు.

కొరియా యుద్ధంలో అమెరికన్ల పరిస్థితి మరీ విషమంగా పరిణమించింది. అమెరికన్ సైన్యాలు ఓడిపోయి కొరియానుంచి పారిపోవలసివస్తుందో, లేక ఉత్తరకొరియన్ సేనల్ని నిరోధించగలుగుతారో తేలిపోగల సమయం ఆసన్నమయింది. రెండింటిలో ఏది జరిగినప్పటికీ కొరియా మరింత దారుణవిధ్వంసానికి గురికావలసిన పరిస్థితి ఏర్పడగలదు. కొరియాలో ఓడిపోతే అమెరికన్లు కొరియా అంతనీ ధ్వంసంచేసిగాని విడిచిపెట్టరు. నిరోధించగలిగితే ఇంతవరకూ కలిగిన పరాజయాలకు పగతీర్చుకోనక మానరు. ఫార్మోజా రాజకీయవ్యవస్థకూడా తారుమారయింది. అమెరికా స్వయంరక్షణకు ఫార్మోజా రక్షణ అవసరమని చెప్పి ట్రూమన్ ఫార్మోజా సంరక్షించడానికి నౌకాబలాన్ని పంపాడు.

ఇలా పంపడంవల్ల, ఫార్మోజాను కబళించాలనే అభిప్రాయం తమకు లేదనీ, ఫార్మోజా రాజ్యాంగ భవిష్యత్తును జపాన్‌తో సంధి ఒడంబడిక ద్వారాగాని, ఐక్యరాజ్య సమితివల్లగాని నిర్ణయించ దలిచారనీ ట్రూమన్ ప్రకటించాడు. జపాన్‌తో సంధి ఒడంబడిక కుదుర్చుకోవాలంటే రష్యా సమ్మతికూడా అవసరం. కాని రష్యా అమెరికాల మధ్య సమాధానం కుదరకపోవడంవల్ల తదితరులతో చేరి అమెరికా సంధి ఒడంబడికను చేయదలచుకుంది.

ఇప్పుడు రష్యా కొత్త ఎత్తు ఎత్తడానికి కొరియా యుద్ధపరిస్థితికీ ఫార్మోజా పరిస్థితికీ సంబంధం ఉంటుందనుకోవచ్చును.

ఫార్మోజా రాజకీయభవిష్యత్తు నిర్ణయం గురించి ట్రూమన్ చేసిన ప్రకటన దృష్ట్యా, ఫార్మోజాలోని చియాంగ్ ప్రభుత్వానికి ప్రభుత్వవ్యవస్థ రద్దయిపోయినట్లే. కాబట్టి భద్రతామండలిలో చీనాప్రాతినిధ్య సమస్యను మండలిలో వోటింగుకు పెట్టనవసరం లేకుండానే, చియాంగ్ ప్రతినిధిని మండలినుంచి వెళ్లగొట్టడానికి అవకాశం ఏర్పడుతోంది. రష్యా ఈ అవకాశాన్ని వినియోగించదలచవచ్చును. అయితే అమెరికన్ వర్గం ప్రతిఘటించడానికి సిద్ధపడుతుంది.

## కొరియా యుద్ధగతి *

కొరియాయుద్ధం క్లిష్టస్థితికి వచ్చింది. అయిదుదినాల్లో కమ్యూనిస్టు సేనలు నైరుతి కొరియాలోని చదునైన ప్రాంతాన్నంతనీ అట్టే యుద్ధం చెయ్యనవసరం లేకుండానే ఆక్రమించుకొన్నాయి. ఆగ్నేయాసియాన కొసనున్న పూసాన్ రేవుకి చుట్టూ నూరుమైళ్ల పరిధి వినహా మిగతా అంతా కమ్యూనిస్టుల వశమయింది. ఈ పరిధికి లోబడి అమెరికన్ సైన్యాలు పోరాడుతున్నాయి. కమ్యూనిస్టు సేనల్ని నిరోధించడానికి చేస్తున్న యత్నాలు విఫలమౌతున్నాయి. ఈ యత్నంలో నగరాల్ని, ఊళ్ళనీ పేరుకైనా లేకుండా అమెరికన్లు ధ్వంసం చేస్తున్నారు.

కొరియా పరిస్థితిపైన భద్రతామండలికి జనరల్ మెకార్థర్ నివేదికను పంపాడు. పరిస్థితి మరీ విషమంగా లేదనీ, ఆశలు లేక పోలేదనీ తెలిపాడు. యుద్ధ వ్యూహాన్ని అవగాహన చేసుకున్నట్లు నివేదించాడు. అయితే పదాతిదళాల్ని త్వరగా సమకూర్చితేగాని పరిస్థితి సానుకూలపడదని నివేదించాడు. సమితి కార్యదర్శి ట్రిగ్వీలీ పదాతిదళాలను పంపవలసినదిగా అన్ని దేశాలనూ కోరాడు. బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, టర్కీ దేశాలు సైనికుల్ని పంపడానికి వాగ్దానమిచ్చాయి - భారతదేశం వైద్యదళాల్ని పంపగలనని వాగ్దానమిచ్చింది. ఈ సందర్భంలోనే కొరియాలో ఏటం బాంబు ప్రయోగించదలచలేదని ట్రూమన్ ప్రకటించాడు.

జనరల్ మెకార్థర్ రెండో పర్యాయం కొరియావచ్చి పరిస్థితిని స్వయంగా చూసి వెళ్లాడు. వెళ్లేటప్పుడు అతని ముఖం అతి గంభీరంగా ఉందని అమెరికన్ పత్రికా విలేఖరులు చెప్పారు. యుద్ధంలో తప్పిపోయిన జనరల్ డీన్ స్థానే జనరల్ చర్చిని మెకార్థర్ నియమించాడు.

యుద్ధం భీషణంగా జరుగుతున్నది. ఎంతమంది ఫిరంగులకాహుతైనప్పటికీ చలించక కమ్యూనిస్టులు ముందుకు వేస్తున్నారు. వీరికి సప్లైలు అందకుండా చేయాలనే వంకతో అమెరికన్లు కమ్యూనిస్టుశ్రేణులకు వెనుకనున్న ప్రాంతమంతటా విచక్షణలేకుండా బాంబులు వేస్తూ ధ్వంసకాండ ప్రారంభించారు.

ప్రాణాలున్నాసరే పోయినాసరే కమ్యూనిస్టు సేనల్ని నిరోధించాలని తన సేనలకు అమెరికన్ సైన్యాధిపతి జనరల్ వాకర్ ఆజ్ఞ ఇచ్చాడు.

[సూర్యనారాయణ]

# భూదేవతకి ప్రజలభారం

(5-వ పేజీ తరువాయి)

తీరం వేలమైళ్ళ పొడవున సారవంతమైన భూమి సహారా ఎడారిగలెనే నిర్జనంగా ఉంది.

ఒక్కసారి భూగోళపటాన్ని చూసినట్లయితే ఎంత ప్రాంతం మానవుల ఉపయోగపడకుండా ఉండిపోయిందో బోధపడుతుంది. దక్షిణా మెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో కొన్ని ప్రాంతాల్లో అసలు జనావాసమేలేదు. బ్రెజిల్ దేశంలో మొత్తం భూమిలో నూరింట $1\frac{1}{4}$ వంతులే సాగవుతున్నది. ఆస్ట్రేలియాలో నూరింట $1\frac{1}{2}$ వంతులే సాగవుతున్నది. యూరప్ ఆసియాలలో కూడా జనాభా అధికంగా ఉన్నదనడం సత్యంకాదు జర్మన్ జాతికి జర్మనీ దేశం చాలదని చెప్తూ దండయాత్రలు చేశాడు హిట్లర్, కాని జర్మనీదేశంలోనే జర్మన్లకందరికీ సరిపడిన ఆహారాదివస్తువుల్ని ఉత్పత్తిచేయవచ్చును. ఇంకా ఎక్కువ కూడా చేయవచ్చును.

భూమిసారాన్ని వృద్ధిపరిచినట్లయితే ఆహారవస్తువులు సమృద్ధిగా ఉత్పత్తికాగలవు. మొక్కలూ వృక్షాలూ ఎంతగ నీటిని, ఇతర వస్తువుల్నీ గ్రహించి వాడుకుంటే, అంతగా వాని ఆకులు సూర్యరశ్మిని స్వీకరించి రసాయనికపరివర్తన మొనర్చి ఆహారధాన్యాల్నీ ఫలాన్నీ పండించగలుగుతాయి.

ఈ ఉత్పత్తికి పరిమితి మొక్కనుబట్టి ఉంటుంది. అదికూడా మార్చడానికి వీలున్నది. ఈ విషయాన్ని రష్యన్ శాస్త్రజ్ఞులయిన తిమిర్యాజెవ్, మిచురిన్, ల్సెంకోలు, విలియమ్స్ కనిపెట్టారు. లోతులను దాటి చేరేశక్తిని భూమి గ్రహించి నిలవచేసుకుంటున్నది. దీనిని ఆహారోత్పత్తికి వినియోగించవచ్చును.

భూమిసారంనుండి ఎంతపిండినా ఇప్పటికంటె మించి సస్యదుగ్ధం రాదని కొందరు వాదిస్తున్నారు. అమెరికాలో అడవుల్ని కొట్టేశారు. భూమిలో కల సారాన్ని ఉన్నమట్టుకు వినియోగించారు. చాలచోట్ల భూమి నిస్సారమయింది. ఒకపొరపైమట్టిలో మూడోవంతును ప్రవాహపు నీరూ, గాలీ తీసుకపోతున్నవి. ఒక విధంగా భూమి నిస్సారం కావడానికి అడవుల్ని కొట్టివేసిన గొడ్డళ్లు, నేలను నిరంతరాయంగా దున్నిపోస్తున్న నాగళ్లు కారణమైనాయన్నమాట.

క్రమక్రమంగా భూమి నవుడువారుతున్నది. నేలచదరం క్రమంగా కుంగుతున్నదికూడా.

మానవుడు భూమినిపిండి సారం తీసుకుంటున్న కొద్దీ భూమినిరోధించేమాట సత్యమే. కాని మానవుడు భూమితో ఘర్షణపడేకంటే సఖ్యత చేసుకోవచ్చునని కొందరు రష్యన్ శాస్త్రజ్ఞులు చెపుతున్నారు.

నేలపై పొర నవుడుబారి దుమ్ముగా మారినట్లయితే ప్రవాహపు నీరూ, గాలీ ఎత్తుకపోక ఏం చేస్తాయి? అది వాని తప్పుకాదు. అది మన్నే విధంలోని దోషం. జలతీరాల్లో విశాలమైన తోటలు, అడవులు పెయ్యాలి. పొలాల గట్లుచుట్టూ దట్టంగా పొదలు, ఎత్తు గట్లు వెయ్యాలి నేలపై పొర విరిగి మన్ను గాకుండా కాపాడాలి. దీనికి ప్రభుత్వాలు జాగ్రత్తపడి కార్యక్రమాలు నిర్ణయించుకోవాలి. (సశేషం)

---

# మనదేశం

(8-వ పేజీ తరువాయి)

కులాలవారికి న్యాయం చేకూరదని మద్రాసు ప్రభుత్వం వాగించింది - కాని కష్టపడి చదివి ఫస్ట్‌క్లాస్‌లో పాసైన విద్యార్థులికి కేవలం వారు బ్రాహ్మణకులానికి చెందినందువల్ల మెడికల్ ఇంజనీరింగ్ కాలేజీల్లో సీట్లు ఇవ్వకపోవడంవల్ల అన్యాయం జరుగుతున్నదనేమాటను ప్రభుత్వం మరిచిపోరాదన్నారు. ఇది సమాజన్యాయం కాజాలదు.

ఈ అంశంపై అల్లాడి కృష్ణస్వామిగారు వాదిస్తూ "సమాజంలో హీనస్థితిలో ఉన్నవారిని" ఎలా ప్రత్యేకించాలో తెలియకుండాలేదన్నారు అన్ని కులాలలోనూ మతాలలోనూ ధనంలేక విద్య పొందజాలకపోతున్నవారున్నారు. సీట్లు కొద్దిగా ఉండి ఏదో రకం వివక్షత అవసరమైనప్పుడు ధనహీనులికి అనుకూలంగా వివక్షత చెయ్యవచ్చునుగాని కులాలనుబట్టి చేస్తే దానివల్ల 'సంఘన్యాయం' చేకూరదు.

ఈ అంశాన్ని తమ తీర్పులో చర్చిస్తూ జస్టిస్ విశ్వనాథ శాస్త్రిగారిలా అన్నారు' "బ్రాహ్మణేతరహిందువులు సమాజంలోని బలహీనవర్గాలకు చెందినవారని చెప్తే నే నంగీకరించలేకుండా ఉన్నాను. చెన్నరాష్ట్రంలో కల మూడు విశ్వవిద్యాలయాలకీ ఒకరివెంట ఒకరుగా వైస్ ఛాన్సెలర్లు బ్రాహ్మణేతరహిందువులే ఉన్నారు. అనేకమంది పేరుపొందిన జడ్జీలు, పెద్ద ప్రభుత్వోద్యోగులు మంత్రులు బ్రాహ్మణేతర హిందువులున్నారు. రాష్ట్రమంత్రివర్గంలో మొత్తం 12 మందిలో 9 మంది బ్రాహ్మణేతరహిందువులున్నారు. ఇటువంటి కులాలవారిని బలహీనవర్గంలో చేర్చడం, అన్యకులాలవారికంటె వీరికి అధిక సదుపాయాల సమకూర్చడం అర్థంలేని పని"

వాస్తవానికి కులనిష్పత్తివల్ల ఎవరిని ఉద్ధరించవలసిన అవసరం ఉన్నదో ఆ హరిజనులకే అపకారం కలిగే అవకాశం ఉందన్నారు. 14 లో రెండు సీటు బ్రాహ్మణులికి, రెండుసీట్లు హరిజనులికీ, ఎనిమిదసీట్లు బ్రాహ్మణేతర హిందువులికీ ఏర్పరచడంవల్ల హరిజనుల్లో అదృష్టవశాత్తు మూడవ — మూడోవాడికి సీటు లభించదు కాబట్టి 46 వ నిబంధనప్రకారమైనా సమాజంలోని బలహీనవర్గాలను ఉద్ధరించడానికి అసలు ఆ బలహీనవర్గాలవారివల్లో ప్రభుత్వం పరిశీలించనైనా లేదు. కులనిష్పత్తివల్ల 'సమాజన్యాయం' సిద్ధిస్తుందని అపోహపడి అమలు జరుపుతున్నారు. కాబట్టి ఇది 29 (2) నిబంధనప్రకారం అక్రమమని విశ్వనాథ శాస్త్రిగారు తీర్పులో చెప్పారు.

జస్టిస్ సోమసుందరంగారు ఎడ్వొకేట్ జనరల్ వాదాన్ని అంగీకరించినప్పటికీ, అనగా 46 వ నిబంధనను అమలుజరుపవలసిన అగత్యమున్నప్పటికీ అది కులవివక్షత ద్వారా జరగరాదని తీర్పు ఇచ్చారు

మరొక అంశాన్ని చూస్తే కులనిష్పత్తి వాస్తవంగా ఏ కులానికీ ప్రయోజనం చేకూర్చడం లేదని బోధపడుతుంది. వాస్తవంగా బలహీనవర్గాలవారికి "అధికావకాశాలు" లభించడానికి వీలులేకుండా మొత్తం 14 సీట్లలో రెండే సీట్లు హరిజనులికి పరిమితం చేశారు. తక్కువ మార్కుల్లో సీట్లు తెచ్చుకోగలుగుతున్న బ్రాహ్మణేతరహిందువులు సమాజంలో కల్ల బలవత్తరమైన వర్గానికి చెందినప్పటికీ, అన్ని కులాలవారికంటె వారికే అధికావకాశాలు లభిస్తున్నాయి (ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు బ్రాహ్మణేతర హిందువులే కాబట్టి ఈ పద్ధతిద్వారా తమిళ కాంగ్రెస్ నాయకులు, వారు చెప్పే ప్రతిమాట తలూపే గోపాలరెడ్డిగారూ ఎన్నికల్లో కాంగ్రెస్‌ని గెలిపించవచ్చుని భావిస్తున్నారు కాబోలు.)

చివరికి బ్రాహ్మణేతర హిందువులకైనా కులనిష్పత్తివిధానం ప్రయోజనకారి

కాలేదు పదేళ్లపైగా ఈ కులనిష్పత్తివిధానం అమల్లో ఉన్నప్పటికీ, ఈనాడు ప్రభుత్వం ఇచ్చిన లెక్కలప్రకారం ఇంజనీరింగ్ మెడికల్ కాలేజీల్లో ప్రవేశం కావాలంటే బ్రాహ్మణుల్లోనూ క్రైస్తవుల్లోనూ ఈ నాటికీ పోటీచెయ్యలేకపోతున్నారు. వాస్తవమేమిటంటే పోతపాల కలవాటుపడిన పాప వలె ఆరోగ్యం కోలుకోలేకపోతున్నారు వీరు. తక్కువకష్టంతో అధికఫలం లభిస్తున్నంతకాలం అధికశ్రమకీ, అధిక ప్రావీణ్యతకీ ఓ ప్పు కొ కు ం టూ పో సు ా త నా ని కి అ ల వ డం కొ ం త సమాజమే. కాబట్టి ఒకవిధంగా కులనిష్పత్తి బ్రాహ్మణేతరహిందువులకు అపకారం చేసిందనాలి మహామహుల్ని సృష్టించగలిగిన బ్రాహ్మణేతరహిందూవర్గం కులనిష్పత్తుల రక్షణల ఆధారంపైన వారిని సృష్టించలేదు. వారు స్వయంకృషిపైన ఉన్నతస్థాయికి వచ్చారు. మిగతావారు రాలేదంటే ఒకవిధంగా కులనిష్పత్తే కారణం

కాబట్టి కులనిష్పత్తి ఎంత త్వరలో రద్దయితే అన్ని కులాలవారికీ అంత లాభదాయకం కాని ఆత్మవిశ్వాసం లేని (స్వకులస్థుల సామర్థ్యంలో నమ్మకంలేని) మన బ్రాహ్మణేతరహిందూమంత్రులు కళ్లు తెరవలేకపోతున్నారు. కోర్టులో పిటిషన్ పెట్టిన ఇద్దరి దరఖాస్తుల్ని మాత్రమే మార్కుల్నిబట్టి పరిశీలించారు. ఇద్దరిలో శ్రీనివాసన్‌కి ఇంజనీరింగ్ కాలేజీలో ప్రవేశమిచ్చి, మార్కులు తక్కువ వచ్చినందువల్ల చంపకం దొరైరాజన్‌కి మెడికల్ కాలేజీలో సీటివ్వలేదు. ఇంతవరకూ రెండు కాలేజీల్లోని మిగతావారందరి దరఖాస్తుల్నీ కులనిష్పత్తిపైనే పరిశీలించి నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని అప్పుడే మార్చుమనే ధోరణి కనపడదు. ఇది బ్రాహ్మణేతరహిందూ వర్గాలపట్ల అశ్రద్ధ. తదితరులకు అన్యాయం హరిజనులపట్ల అపచారం.

## ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నికల రభస *

మళ్ళీ ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ పంచాయతీఎన్నికలపైన కొత్త విచారణ జరిగింది బొంబాయిమేయరు యస్. కె. పాటిల్ గారు ఈ విచారణ, సినిమా పరిశ్రమ విచారణకూడా సాగించేస్తున్నారు.

కాంగ్రెస్ విచారణ కోటీశ్వరుడు అశ్వగప్పచెట్టిగారి భవనంలో జరిగింది. తెలుగు జిల్లాలనుంచి రాష్ట్రనాయకులు, జిల్లానాయకులు, తాలూకా నాయకులు, పట్టణ నాయకులు గ్రామాల కాంగ్రెస్ నాయకులు అనేకులు దాదాపు అన్ని జిల్లాలనుంచీ వచ్చారు ఫిర్యాదుల కట్టలు స్టేట్‌మెంట్లు, మంచి జాబితాలు, తప్పుడు జాబితాలు, నివేదికలు వగైరా ఫైళ్ళు చేతబట్టిన కాంగ్రెస్‌వాదులతో భవనం కిటకిటలాడిపోయింది ఆ ప్రాంతం హైకోర్టును జ్ఞాపకం తెచ్చింది.

తప్పో ఒప్పో ఇంతవరకూ జరిగిపోయిన ఎన్నికల్ని అంగీకరించి మిగతా ప్రాంతాలకు సంబంధించినంతమటుకు సమాధానం చేసుకోవలసిందని పాటిల్‌గారు సూచించారు కేవలం తమ నుద్ధరించడానికి అవతరించిన మహాపురుషుడు పాటిల్ అని ఊహించిన వారికి ఆశాభంగ మయింది.

ఇంతవరకూ జరిగిన ఎన్నికల్నిబట్టి రాష్ట్ర కాంగ్రెస్ సభ్యత్వాల్లో తమ వర్గానికి మెజారిటీవచ్చిందంటే తమ వర్గానికే మెజారిటీ వచ్చిందని రంగాపార్టీవారు కళాపార్టీవారు అన్నారు అంటే ఇంతవరకూ జరిగిన ఎన్నికల్నిబట్టి అప్పుడే రాష్ట్ర కాంగ్రెసుసభ్యత్వాల్ని పంచేసుకున్నారన్నమాట. ఆప్రకారం ఉల్లనీ తాలూకాల్నీ జిల్లాల్నీ పంచేస్తున్నారు పంచుకోగా ఇప్పటికి తేలిన బలాల్ని స్థిర పర్చుకుని, మిగిలినవాటిని చెరిసగం పంచుకోమని సలహా ఇచ్చారు పాటిల్‌గారు కాని పశ్చిమగోదావరిలో చెరిసగం పంచుకోడాని కొప్పుకున్న రంగాపార్టీవారు గుంటూరులో అలా పంచుకోడాని కొప్పుకోలేదు, వారికి గుంటూరులో స్థానికబలం ఉన్నది కాబట్టి గుంటూరుజిల్లాలో పంచుకోడానికొప్పుకున్న కళాపార్టీవారు పశ్చిమగోదావరిలో పంపకానికి కొప్పుకోలేదు. విశాఖజిల్లాలో ఒక ప్రాంతంలో రంగా పార్టీవారు ప్రత్యర్థిపక్షానికి చెందినవారి పేర్లన్నిటినీ నామినేషన్ల జాబితానుంచి పూర్తిగా తుడిచిపెట్టేసినందుకు అక్కడ మళ్లీ ఎన్నికలు జరపాలని పాటిల్‌గారన్నారు

మొత్తానికి సమాధానం కుదురలేదు మన ఎన్నికలు జరపడానికి ఏ నాదార్ బంటులో మరో రాష్ట్రకాంగ్రెస్ వాదులో వచ్చి అజమాయిషీ చెయ్యవలసివస్తుందన్నమాట. వీనిలో కూడా సవ్యంగా ప్రవర్తించకపోతే నాసిక్ కాంగ్రెస్‌కి ఈజిల్లాలోనుంచి ప్రతినిధులు వెళ్ళడం ఉండకుండాపోతుందనీ, అధ్యక్షుని ఎన్నికల్లో పాల్గొనడానికి వీల్లేకుండాపోతుందనీ పాటిల్‌గారు హెచ్చరించారు. [సీతారామ్]



దోసకాయలపల్లి హైస్కూలు ప్రారంభోత్సవ సందర్భ దృశ్యం. చిత్రంలో కూర్చున్న వెంకటరత్నం, మంత్రి నీలం సంజీవరెడ్డి, నీలకంఠ రామారావు, మారిన నరసన్న హైస్కూలు హెడ్మాస్టరుగార్లు కలరు.



కొరియా వెళ్లడానికై జపానులో ఓడ యెక్కుతున్న
అమెరికన్ సైనికులు



దక్షిణకొరియా సైన్యములోని కొంతమంది సురక్షితులై
తుపాకి సైనికులు.

#  కొరియా యుద్ధము 



విరామ సమయంలో కొంతసేపు చాటుమాటుల్లో విశ్రాంతి
తీసుకొని మళ్లీ యుద్ధరంగానికి పోవ దూకుడుగా బారులు
తీరుతున్న అమెరికన్ పదాతిదళం.



దక్షిణకొరియాలోని యుద్ధరంగానికి పెద్దపెద్ద తుపాకులతో
చేరవేస్తున్న అమెరికన్ ట్రక్కులు.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.